కన్‌ఫ్యూజ్ అయ్యే అన్న



పాతకాలపు అనురాగం కలిగిన తమ్ముడు



శ్రీ సారథీ స్టూడియోస్ వారి



# ఆత్మీయులు

సంగీతం రాజేశ్వరరావు * దర్శకత్వం వి.మధుసూదనరావు * ఫోటోగ్రఫీ సెల్వరాజ్

నిర్మాత: దుక్కిపాటి మధుసూదనరావు బి.ఎ.

నవయుగ

అంతా ఆత్మీయులతో



NVKR

వెస్ట్ రైట్సు
శ్రీ ఫిలింస్

Mr. K. N. Kuppuswamy, Chairman of Telengana Kala Niketan, Hyderabad, appeals as follows :-

Telengana people are contributing millions of Rupees annually to Andhra producers, actors, directors, writers, technicians, distributors and exhibitors of films. Of course, we are also contributing to English, Hindi and other language films. But there is a difference. We are patronising non-Telegu films on equality basis but are looted by Imperial Andhras who are heavily sitting on our backs in this field too. We should boycott Telugu films from 15-8-1969 onwards and ask exhibitors and distributors not to show.

We must boycott all Telugu dailies, weeklies and monthlies which are published from various Centres in Andhra and Madras. We must ask news papers and magazines published in the twin Cities to stop claiming publication from the capital of AP or circulation on the basis of AP State. Those papers which have no sympathy for the people of the region, have no right for publication and sale to Telenganites.

On behalf of Telengana Kala Niketan, I appeal to the people of 9 Districts of Telengana and Twin Cities to look into this call and make it a success. Especially, I bank upon Telengana Praja Samithi and Telengana Students Action Committee to champion this call.

K. N. KUPPUSWAMY, CHAIRMAN
TELENGANA KALA NIKETAN

[మాకు అందిన ఒక కరపత్రం బొమ్మనీ, దాని అనువాదాన్నీ ప్రచురిస్తున్నాము.—సం॥]

శ్రీ కె. ఎన్. కుప్పుస్వామి, తెలంగాణా నికేతన్, హైదరాబాదు, ఈ విధంగా విజ్ఞప్తి చేస్తున్నారు.

ఆంధ్ర నిర్మాతలకీ, నటులకీ, దర్శకులకీ, రచయితలకీ, సాంకేతిక నిపుణులకీ, డిస్ట్రిబ్యూటర్లకీ, ఎక్సిబిటర్లకీ తెలంగాణా ప్రజలు లక్షల రూపాయలు ఇస్తున్నారు. మనము ఇంగ్లీషు, హిందీ, ఇతర భాషల చిత్రాలకోసంకూడా వెచ్చిస్తున్నాము. కాని, దీనికీ దానికీ తేడా ఉంది. తెలుగు కాని భాషల చిత్రాలని సమానంగానే మనం చూస్తున్నప్పటికీ మనల్ని ఆంధ్రా సామ్రాజ్యవాదులు ఈ విధంగాకూడా దోచుకుంటూనే మన వీపులమీద కూర్చుంటున్నారు. 15—8—1969 నుంచి మనము తెలుగు చిత్రాలని బహిష్కరించాలి, ఎక్సిబిటర్లనీ, డిస్ట్రిబ్యూటర్లనీ చూపించరాదని అడగాలి.

ఆంధ్ర, మదరాసులలోని వివిధ కేంద్రాలనుంచి వెలువడే తెలుగు దినపత్రికలనీ, వారపత్రికలనీ, మాసపత్రికలనీ మనం బహిష్కరించాలి. జంట నగరాలనుంచి వెలువడే వార్తాపత్రికల వారినీ, మాగజయిన్ల వారినీ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధానినుంచి వెలువడుతున్నట్లు చాటవద్దని కోరాలి; ఆంధ్రరాష్ట్రం ఆధారంగా సర్క్యులేషన్ గురించి చెప్పుకోనటం ఆపమని కోరాలి. ప్రాంతీయ ప్రజలపట్ల సానుభూతిలేని పత్రికలకి తెలంగాణా వారికోసం వెలువడి, అమ్ముడుపోయే హక్కులేదు.

ఈ విజ్ఞప్తిని పరిశీలించి దానిని విజయవంతం చెయ్యమని 9 తెలంగాణా జిల్లాల ప్రజలనీ, జంట నగరాల ప్రజలనీ కోరుతున్నాను. ఈ విజ్ఞప్తిని బలపరిచే భారం తెలంగాణా ప్రజాసమితి, తెలంగాణా విద్యార్థి కార్యాచరణ సంఘం వారిదని నమ్ముకుంటున్నాను. —కె. ఎన్. కుప్పుస్వామి వ్రాలు, తెలంగాణా కళానికేతన్ అధ్యక్షులు.

# ఉత్తరాలు

## సీరియల్

శ్రీమతి శిఖా(గంటి) వెంకటరమణగారి "పతిలిప్తం" కథలో కాళిదాసు, "అప్పుడప్పుడు లేస్తూనే మొహం కడుక్కోకుండా కాఫీ త్రాగడం నాకూ అలవాటే జయా" అని అనడం సమంజసంగాలేదు. పల్లెటూళ్లలో శుచి శుభ్రం ఎక్కువ. సాధారణంగా అక్కడ పాచి మొహంతో కాఫీ ఎవరూ త్రాగరు.

గంటి నాగేశ్వరరావు (హైదరాబాద్)

## వ్యాసాలు

ఈమధ్య తెలంగాణా ఉద్యమానికి, ఆంధ్ర రాష్ట్రోద్యమానికి పోలిక ఉన్నట్లు కొందరు తెలంగాణా అభిమానులు చెప్తున్నట్లు తెలిసింది. ఆంధ్రరాష్ట్రం విడిపోయినప్పటికి మదరాసులోనే ఉండిపోవటానికి నిశ్చయించుకున్న తెలుగువాడినిగా ఈ ఉత్తరం రాస్తున్నాను.

తెలుగు తమిళం ఒకేభాష కాదని అందరికీ తెలుసుననుకుంటాను. ఆంధ్రోద్యమం (లేక తెలుగు వారికి వేరే రాష్ట్రం కావాలనే ఉద్యమం) ఈనాటిదికాదు. ప్రకాశం పంతులుగారి శిష్యులు కొందరు కొన్ని దుష్ప్రచారాలు చేసినా బాధ్యత గలవారెవరూ ఎప్పుడూ తమిళులు అన్యాయం చేస్తున్నారు కాబట్టి ఆంధ్రరాష్ట్రం కావాలని కోరలేదు. అక్టోబరు 1953 కి కొంచెం ముందు కొందరు ఆంధ్రాభిమానులు లారీలలో "మదరాసు మాదే" అని అరుస్తూ తిరిగారు. వారిని చూసి అందరు నవ్వుకున్నారు!

అప్పటినుంచి ఇప్పటిదాకా మదరాసులో తెలుగు వారికి ఎప్పుడూ ఏవిధమయిన భయము కలగలేదు.

అలాగే ఆంధ్రప్రాంతంలో ఉంటున్న తమిళులకి కూడ ఎప్పుడూ ఏ విధమయిన ప్రమాదము ఉన్నట్లు ఎవరూ పొరపాటున అయినా అనలేదు!

"పోటీలో అరవవాళ్లతో నెగ్గలేము" అని భయపడే కొందరు పిచ్చిగా వాగినంత మాత్రాన ఎప్పుడూ పేచీ రాలేదు.

పొట్టి శ్రీరాములు గారు తమ ప్రాణాలను బలి ఇచ్చి ఉండనవసరం లేదని ఎందరిలోనోబాటు నేనూ నమ్ముతున్నాను.

ఈ సందర్భంలో ఒక చిన్న కథ చెప్తాను. స్టాలిన్ పోయిన రోజున ప్రెసిడెన్సీ కాలేజీలో మీటింగు పెట్టగా నలుగురు మాత్రమే హాజరయ్యారు. పొట్టి శ్రీరాములు గారి జ్ఞాపకార్థం వారు మరణించిన వెంటనే ఏర్పరచిన సమావేశానికి వచ్చిన విద్యార్థులకి మెయిన్ లెక్చర్ హాలు చాలలేదు. అప్పటి విద్యార్థి సంఘం నాయకుడు శ్రీ చిదంబరనాథన్ చేసిన ప్రసంగం ఎందరికో కళ్లు చెమర్చేట్లు చేసింది. ప్రకాశం పంతులుగారు, ఓమండూరు రామస్వామిరెడ్డిగారు, కుమారస్వామి రాజాగారు, బొబ్బిలి రాజాగారు తమిళులు కారన్నా తప్పు లేదనుకుంటాను.

—"మాజీ ఆంధ్రా" (మదరాసు).

* * *

మీకు చాలా కృతజ్ఞతలు. మీరుదయతో ప్రచురించిన వుత్తరము చూచినాను. ఆవేశములో చాలా బాగా రాసినాను. వుత్తరములు రాసేటప్పుడు,అడ్రస్

కావలెననినారు. తప్పకనిస్తాము. మాకు భయము లేదు: మీరు దైర్యంతో ఈ వుత్తరము కూడ ప్రచురించగలరు. మాకు జరిగిన అన్యాయములు చెప్పాలంటే చాలా వున్నవి. ఆంధ్రప్రదేశము అవతరించిన తదుపరి మా సీనియారిటీ లిస్ట్సులు ఆంధ్రా డైరక్టర్లు, క్రిందికి మీదికి చేసి ప్రమోషన్ అవు చేసినొక్కిపెట్టి సీనియర్లకు సున్నా చుట్టినారు. జూనియర్లు, మాకు ఆఫీసర్లు. ఆంధ్రా వాండ్లకు వున్న తలబిరుసు, ఏ తెలంగాణా ఏ ఆఫీసరుకు వుండదు. తరువాత లంచాలు యిచ్చిన వాండ్లకు ప్రమోషన్ యిచ్చినారు. నాగార్జున ప్రాజక్టుకు కె. ఎల్. రావుగారి తెలివి వుపయోగించి అంతా నీరు ఆంధ్రాకి తిప్పినాడు. అది అన్యాయముకాదా? పోచంపాడు చెరువుకుడబ్బులేదు. ఆనందానికి—ముల్కి నిబంధనలులేవు. అది అన్యాయముకాదా? కండ్లకు కనుపించే క్వార్టర్సు మాకు నాలుగుసార్లనుంచి రాలేదు. కొనటానికి రాలేదు. కిరాయికి రాలేదు అది అన్యాయముకాదా? అన్నిటిల్లో మమ్ములను అణగతొక్కాలని ఆంధ్రా...అభిప్రాయము. గుండాలుచేసే పనులకు మాది బాధ్యతకాదు. నడిబజార్లలో దుర్గా హోటలులో ఆంధ్రా గుండాలు 18 సం. కుమారుని (పేరు గ్గా జ్ఞాపకములేదు) చంపుట ధర్మమా, ఆనందమా, పరమానందమా ఏ విధంగా మమ్ములను చంపిస్తున్నాడో మీకు తెలియదా? ఆంధ్రా వాండ్లకి కండ్లు వున్నవా? మేము ఇంటికి పదిమందిమైనా చస్తాము. తెలంగాణా సర్వనాశనముకాని, మేము మీతో కలవము, మీ తెలివివద్దు. మీ రాజ్యము వద్దు యింటింటికి, యింటికి గుండాలాగా బయలుదేరుతాము. రక్తపు యేరులు పారనీ, పట్టివ పవిత్ర ఆశయము నెరవేరువరకు ఆడవాండ్లముకూడా, గృహిణులు కూడా పిల్లలు కూడా బయలుదేరుతాము. మా తెలంగాణా సర్వనాశనము చేసినా పరమానందమా! కసి తీరదా? ఇంకా ఆంధ్రా వాండ్లకు సమైక్యత కావాలా, మా గండిపేట నీరు వదల బుద్ధికావటములేదా?

ఎం. సీతమ్మ, చింతలబస్తీ (ఖైరాతాబాదు)

తెలంగాణా సమస్య మీద ఇప్పటికే చాలా ఉత్తరాలు వచ్చాయి. వీలుని బట్టి వాటిని ప్రచురించటానికి ప్రయత్నిస్తున్నాము. ఇక ఈ సమస్యకి సంబంధించిన ఉత్తరాలు రాసి పంపటం ఆపమని పాఠకులను కోరుతున్నాము. ఉద్యమం సందర్భంలో జరిగిన అత్యాచారాలను గురించి కొందరు వివరాలు పంపుతున్నారు; వాటికి సంబంధించిన ఆధారాలు సరయినవి చూడకుండా ప్రచురించలేమని పాఠకులు గమనించగలరు.

—సంపాదకుడు

# ఉత్తరాలు

ఈ మధ్య మీ పత్రికలో తెలంగాణవారు కొందరు ఆంధ్రావాండ్లు మమ్మల్ని ఏలి, వాండ్లు తెలివి కలవాండ్లు కాబట్టి మాకు మోసం చేస్తూ యున్నారు—అని వ్రాయుచూ యున్నారు. ఈ విధంగా అనటం స్వయం మర్యాదకి బాగలేదు అని అనుకుంటూ యున్నాను!

——అర్. కె. రావ్. (మద్రాసు).

*　　*　　*

అర్యా!

25—7—69 నాటి పత్రికలో ప్రచురించిన "తెలుగు సమైక్యతా మైదానములో తోడేళ్ళ గుంపు" శ్రీ యాదగిరిగారు వ్రాసిన వ్యాసము ప్రచురించిన తర్వాత, ఈ లేఖ వ్రాయవలెనని అభిప్రాయము కల్గినది. వాస్తవంగా తెలంగాణాలో నివసించేవారు అన్ని వర్గాలవారు ఉన్నారు. తెల్లవాండ్లు, మహమ్మదీయులు, కాయితీలు, గుజరాతీలు, మార్వాడిలు, సింగ్‌లు, జైనులు, కన్నడులు, మళయాళీలు, ద్రావిడులు మున్నగు వారెందరో మనుగడ సాగించు చున్నారు. వీరిలో కొన్ని వర్గాలు పూర్వము నుండియు మరికొన్ని వర్గాలవారు 200 సం., 150 సం., 100 సం, 50 సం., 25 సం. ల పూర్వము, చివరికి ఆంధ్రప్రదేశ్‌కు అవతరణ పూర్వము కూడ వచ్చి స్థిరపడిపోయినవారు కూడ ఉన్నారు. అయినా శ్రీ వై. యాదగిరిగారు వ్రాసిన వ్యాసము సంకుచితము ప్రాంతీయ దురభిమానము చాటు చున్నది. తెలుగువారిదే హక్కు అన్నట్లు ఏమంత సమంజసమైనది కాదు. అంగీకరింపజాలని విషయము.

"తెలంగాణా ఉద్యమము" తెలంగానేతరులు సృష్టించినది అని అభిప్రాయపడడము, ఎంత మాత్రము సరియైనది కాదు. ఈ ప్రాంతములో పుట్టి పెరిగిన అందరికి సమానమైన హక్కు ఉన్నది. కాని, ఒకే భాష మాట్లాడెవారిదే హక్కు ఉన్నట్లు, ఇతరులకు స్థానము లేనట్లు ఈ మధ్యన క్రొత్త వివాదము చేయుచున్నారు.

పూర్వాపరాలు తెలుసుకోకుండ ఉద్యమాన్ని దుయ్యబట్టడమే ధ్యేయముగా పెట్టుకొన్నారు. వాస్తవంగా పరిశీలించి నట్లయితే, రాష్ట్రాల పునర్విభజన జరిగినప్పుడు, తెలంగాణావారికి ఆంధ్ర

(64వ పేజీ చూడండి)

## వరద బాధితులకి విరాళం

'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న 'ఆంధ్ర తుఫాను బాధితుల సహాయ నిధి'కి బిలాస్‌పూర్‌లోని ఆంధ్రప్రదేశ్ సైక్లోన్ రిలీఫ్ ఫండ్ కలెక్షన్ కమిటీవారు రు. 1,800లు విరాళం యిచ్చారు.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 29—8—'69
శ్రీ సౌమ్యనామ సం॥ శ్రావణమాసం బ. విదియ
సంపుటము : 61　సంచిక : 53

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయసూచిక

మేడమ్, సోషలిస్టు అంటే ఎవరు?
నన్ను సమర్థించిన వాళ్లంతా!
కరణ్ సింగ్, దినేష్ సింగ్, జగ్ జీవన్ రాం- వీరంతా ఎప్పటినుంచి సోషలిస్టులయ్యారు?
సేవకు ప్రతిఫలం
ముస్లిం లీగ్
కేరళ మార్క్సిస్టులు
నక్సలైట్లు
కమ్యూనిస్టులు
పదవీ వ్యామోహం

# కేంద్రమంత్రివర్గంలో ప్రభుత్వోద్యోగులకి ప్రాతినిధ్యం?

బాంకుల జాతీయానికి సంబంధించిన బిల్లుని పార్లమెంటులో ఆమోదించటం జరిగింది. ఈ పని అవసరానుసరంగా చేశారు. తాత్కాలికాధ్యక్షులు 9 వ తేదీన ఈ 'చరిత్రాత్మక' మయిన దనబడే బిల్లుమీద తమ ఆమోదముద్ర వేశారు. దీనిని ఈ విధంగా వర్ణించినవారు ప్రధాన మంత్రి మేడమ్ గాంధీగారూ, కమ్యూనిస్టులు. పార్లమెంటులో ఇంతకుముందు ఏ చట్టమూ ఇంతవేగంగా ఆమోదింప బడలేదేమో కాని ఈ బిల్లు ఆమోదింప బడిన పద్ధతికీ రవులాట్ బిల్లు ఆమోదింపబడిన పద్ధతికీ చాలాపోలికలుఉన్నాయి!

బాంకు బిల్లు హడావిడిగా ఆమోదింప బడింది కాబట్టి కొన్ని సవరణలు వదిలి వెయ్యటం, వాటిని తప్పుగా అనుసరింపటం జరిగింది. ప్రభుత్వంవారి ఆయా వాటా పరిస్థితిని పరిశీలించి చేసుకోవాలంటే వాటాదారులకి ఇచ్చే పరిహారానికి సంబంధించిన అంశాలని పరిశీలించవచ్చు.

బిల్లుని మొదట ప్రవేశపెట్టినప్పుడు పరిహారం బాంకులద్వారా అన్నారు; తర్వాత వాటాదార్లకి, అన్నారు; చివరికి బిల్లు ఆమోదించ బడటానికిముందు బాంకుల ద్వారానే అన్నారు.

కొందరు కాంగ్రెసు పురోగమనవాదులు వాటాదార్లకి 45 శాతం వడ్డీ పదిసంవత్సరాలు రావటం మంచిది కాదన్నారు; జమీందారీ బాండ్లకి 40 ఏళ్ళ పాటు 2.5 శాతం మాత్రమేకదా అన్నారు.

## చిన్న ఆదాయాలవారు

బాంకులలో 50 శాతం షేర్లు చిన్న ఆదాయాలు కలవారికే అని వీరికి చెప్పి లాభంలేదు. జాతీయం అయిన బాంకులలో 24 శాతం ఎల్. ఐ. సి., యూనిట్ ట్రస్టులది వీటికి బ్రువేకూర్చినవారు ఎవరు అధికంగా చిన్న ఆదాయాలు కలవారే కదా

కొందరు కమ్యూనిస్టు సం. సో. పా. సభ్యులు ఒక సవరణ ప్రతిపాదించారు. జాతీయంఅయిన బాంకుల డయిరెక్టర్లుగా బాంకు ఉద్యోగుల ప్రతినిధులు (వీరు ఉద్యోగులు కానవసరం లేదు), డిపాసిట్లు వేసిన వారి ప్రతినిధులు, వ్యవసాయదారుల ప్రతినిధులు ఉండాలన్నారు కార్మికులు, వ్యవసాయదారుల ప్రతినిధులని ఎన్నుకొనటంకష్టం కాబట్టి ప్రభుత్వంవారే వారిని నియమించ వలసివస్తుందని చట్టశాఖామంత్రిఅన్నారు.

## బాంకు ఆవరణలో ప్రదర్శనలు

బాంకు ఉద్యోగులు బాంకుల ఆవరణలో ప్రదర్శనలు జరుపవచ్చునన్నారు కమ్యూనిస్టులు. ఈ సవరణకి ప్రభుత్వంవారు అంగీకరించలేదు. విదేశీ బాంకులని జాతీయం చెయ్యనవసరం లేదనికూడా ప్రభుత్వం వారు అన్నారు.

ఉద్యోగుల ప్రతినిధులు జాతీయం అయిన బాంకులలోనే కాదు, రిజర్వు బాంకులో, స్టేట్ బాంకులో, చివరికి కేంద్రమంత్రి వర్గంలోకూడా ఉండాలి—అనే వివాదాలు త్వరలో మనము వినవచ్చు.

జాతీయం అయిన 14 లో అలహాబాదు బాంకు ఒకటి. 1968 చివరికి ఈ సంస్థ 130 బ్రాంచిలలో రు 112 కోట్ల రూపాయలడిపాసిట్లు ఉండేవి ఇది 92 శాతం బిటిషువారుజమాన్యంకల బాంకు.

## 56.8 శాతం

31–3–1967 నాటికి షెడ్యూల్డ్ బాంకులలో ఉన్న డిపాసిట్లలో 56.8 శాతం వ్యక్తులవి. 1965 లో ఈ రకం డిపాసిట్ల శాతం 51.6 ఉండేది, 1966 కి 55.1 అయింది. ఇక ఎకవుంట్ల సంఖ్య 90,67,000 నుంచి 123 63 000 కి పెరిగింది. (1965 నుంచి 1966 దాకా)

31-3-1967 నాటికి షెడ్యూల్డ్ బాంకులలో డిపాసిట్ల వివరాలు ఈ కింది విధంగా ఉన్నాయి—

| | మొత్తంలో శాతం | కోట్ల రూపాయలు |
|---|---|---|
| వ్యాపారం | 25.3 | 0896.6 |
| పరిశ్రమ | 09.1 | 0321.7 |
| అమ్మకంకొనుగోళ్ళు | 08.6 | 0305.0 |
| ఆర్థిక విషయాలు | 07.0 | 0246.3 |
| ఇతరం | 00.6 | 0021.6 |
| వృత్తి, ప్రభుత్వ సంస్థలు | 05.2 | 0184.9 |
| మొత్తం | 56.8 | 2112.7 |

## మధ్యతరగతుల వారివి

పయి సంఖ్యలనిబట్టి మనం గ్రహించ గలిగినది ఏమిటంటే—బాంకులలో నిధులు మధ్య తరగతులవారివి. వీరిగతి ఏమవుతుందో ప్రధానమంత్రి సూచించారు. వారు ఇప్పుడు ఆర్థికశాఖ మంత్రికూడా.

'ఆస్తిరూపంగా అప్పు చెల్లించినవారు తాకట్టు ఇవ్వటం అనేది సరయిన బాంకింగ్ విధానం కానేరదు' కొందరు ఇటువంటి హామీ ఇవ్వలేకపోయినా అప్పు పొందతగినవారు కావచ్చు. అప్పు అనేది ఉద్దేశాలనిపట్టి ఇవ్వటం మంచిది అనుకుంటాను. ఉత్పత్తి, ఉద్యోగ అవకాశాలు పెంపొందించే అప్పులనే ఇకమీద ప్రోత్సహించటం జరుగుతుంది. స్వయంకృషికోసం వాడే అప్పులు జారీచెయ్యటం తగ్గుతుంది. ప్రస్తుతం మన బాంకులకి ఈ దృష్టితో అప్పులు ఇవ్వగలిగే సామర్థ్యం లేదు. ఇక మీద ఈ దృష్టితో అప్పు కోరికలని పరిశీలించగలిగే విధంగా వ్యక్తులకి శిక్షణ ఇవ్వటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుంది.'

ఈ కొత్త విధానాన్ని అనుసరించి నాలుగవ ప్రణాళికని పునర్నిర్మించమని ప్రధాన మంత్రి ప్రణాళికాసంఘాన్ని కోరినట్లు తెలుస్తుంది.

## రు. 400 కోట్లు?

బాంకుల జాతీయంవల్ల ప్రతి సంవత్సరం కొత్త డిపాసిట్లు రావటంచేత ప్రభుత్వానికి రు 500 నుంచి 600 కోట్లదాకా దొరకవచ్చునని అంచనా ఇందులో సుమారు 65 శాతం, లేక 350 నుంచి 400 కోట్ల రూపాయలదాకా, మాత్రమే పెట్టుబడికోసం లభ్యం అవవచ్చు. దీని కోసం ఎందరో ఎగబడతారు. ప్రణాళికల కోసం ఎంత మిగులుతుందో చూడాలి.

ప్రణాళిక మొత్తానికి సుమారు రు. 1500 ఉంటాయనుకుంటే ఇందులో ప్రభుత్వరంగానికి సగం, ప్రయివేటు రంగానికి సగం ఇవ్వాలంటున్నారు కొందరు. అంటే, 'ప్రభుత్వరంగానికి దొరికే కేటాయింపు కొన్ని వందలకోట్లు పెరిగి ప్రయివేటురంగానికి దొరికేది

అంత మొత్తానికి తగ్గుతుందన్నమాట.

**సగం, సగం కాక ...**

ప్రధానమంత్రి ఆప్తులు కొందరు మాత్రం కేటాయింపు సగం, సగం కాక పూర్తిగా ప్రభుత్వరంగానికే ఇవ్వా లంటున్నారుట. ప్రయివేటురంగం వారు తమకి లోటినది తాము చేసుకో వచ్చు నంటున్నారుట. అంతేకాక, ప్రయివేటు రంగంవారు ప్రణాళికా సంఘంవారు సూచించిన రు. 13 900 కోట్లుకా అంతకన్నా ఎక్కువ మొత్తాన్నే పొదుపు అయ్యేందుకు సాయపడ లిట దీనికోసం ప్రయివేటురంగం కేటాయింపుని తగ్గించకుండా ప్రభుత్వరంగం కేటాయింపుని కావలసినంతా పెంచ తారుట!

**కేంద్రం, రాష్ట్రాలు**

ఇక కేంద్ర, రాష్ట్ర పంపిణీల వెలా ఉండాలి? ఫయినాన్స్ కమిషన్ నివేదిక సూచనల ప్రకారం ఉండాలిట.

అప్పుడే. రాష్ట్రప్రభుత్వాలు సిధు మీద తమ హక్కులని గురించి మాట్లాడు తున్నారు

ప్రభుత్వం రంగంలో జరిగిన పెట్టుబడివాద నష్టాలు వస్తున్నాయి; కాని. లాభదృష్టితో కాక నిర్మాణాత్మక దృష్టితో ఈ విషయాన్ని పరిశీలించాలి, అని శ్రీమతి గాంధీగారు అన్నారు.

**రాజకీయవాదులు**

'ఒక ప్రాజక్టుకి అప్పుఎంత ఇవ్వాలి?' ఈ ప్రశ్నకి సమాధానం ఇచ్చేది ఎవరు? 'రాజకీయ వాదులే' అని వేరే చెప్ప నవసరం లేదు.

ఎప్పటి కప్పుడు అధికారంలో ఉన్న వారు అప్పు, పెట్టుబడి – వాటి రెండింటినీ నిర్మాణాత్మక దృష్టితో చూస్తూ ఉంటారని ఊహించవచ్చు. దేశంలో లక్షల మంది దాచుకున్న మొత్తాలకి మంచి భవి ష్యత్తు ఉంది!

**రష్యా తిరోగమన విధానం!**

సోవియట్ రష్యా ఈ మధ్య తిరోగమన విధానాలని అనుసరిస్తోంది. ప్రభుత్వం నెల కొల్పిన సంస్థలలో లాభాలు రావాలం టుంది! ఎంతఘోరం!!

# పోలీసులున్నారు జాగ్రత్త!

ఈ మధ్య కొందరు పోలీసువారు పశ్చిమబెంగాలు శాసనసభమీదకి వెళ్ళారనే వార్తలు వెలువడ్డాయి. వారిని చూసి జడుసుకున్న సభ్యులు కొందరు కిటికీలలో నుంచి దూకారని వింటాము. పశ్చిమ బెంగాలు శాసనసభలోకెల్లా అధికసంఖ్యాకులు ఎడమపక్షం కమ్యూనిస్టులు. వారు శాంతియుతమయిన అహింసా పద్ధతులని నమ్మేవారుగా తోచరు. వారిలో కొందరు విప్లవంగురించి, రాజ్యాంగాన్ని మాపటం గురించి మాట్లాడుతూ ఉంటారు. కాని, తమదాకా వచ్చేసరికి వారి వాలకం మారిపోతుంది. పోలీసుల దుండగీతనంగురించి ఎంతో ఉద్వేగంతో మాట్లాడుతారు. ఇది మానవసహజం అని సరిపెట్టుకోవచ్చు; నిజానికి ఇది వారి విధానాలలో ఇమిడి ఉన్న ఒక అంశం.

తమ లక్ష్యాన్ని ఎలాగయినా సాధించాలనుకునేవారి వాదాలని తర్కదృష్టితో చూసి ప్రయోజనం ఉండదు. ఇటువంటివారి తత్వానికీ ప్రజాస్వామ్యసిద్ధాంతాలకీ చాలా దూరం. అయితే ఇటువంటి సందర్భాలలో పోలీసువారి పాత్రని గురించి ఏమనాలి?

రాజకీయోద్యమాలలో పాల్గొనేవారు పిలుపిచ్చినప్పుడల్లా బస్సులు, రైళ్ళు మొదలయిన ప్రజల ఆస్తుల విధ్వంసానికి పూనుకొనటం ఇప్పటికి కొంతకాలంగా జరుగుతూ వస్తున్నదే! దేనికో ఒకదానికి వ్యతిరేకంగా మొదలయ్యే ఉద్యమాలలో ఈ విధ్వంసం తీవ్రంగా ఉంటుంది; కాని, ఏదో కావాలనుకుని అసంతృప్తి చెందేవారి ఉద్యమోద్రేకాలు కూడా తీవ్రరూపాలనే దాలుస్తాయి. మొదటిరకం విధ్వంసం మదరాసులో జరిగిన హిందీ వ్యతిరేకోద్యమంలోనూ, రెండవరకం విధ్వంసం తెలంగాణా ఉద్యమంలోనూ కనిపిస్తాయంటే అతిశయోక్తి కానేరదు. ఈ రెండు ఉద్యమాలలోనూ ప్రజలలో అధికసంఖ్యాకులు పాల్గొన్నారంటేకూడా అతిశయోక్తి కానేరదు. హిందీద్వేషంతో బస్సులనీ, కేంద్రప్రభుత్వం ఆస్తులనీ కొందరు నాశనం చేసినప్పుడు కీ. శే. అన్నాదురయ్య—ఎంత వస్తునష్టమయినా ఒక్కమానవప్రాణంతో సమానం కాదు, అన్నారు. పాలకులు ఇటువంటి సందర్భాలలో జరుగుతున్న ఉద్యమాలపట్ల తమ ఆమోదాన్ని ఈ విధంగా మాత్రమే బహిరంగంగా తెలుపుతూ ఉంటారు. ఉద్యమంలో పాల్గొన్నవారిపట్ల 'ఉదారంగా' ప్రవర్తించవలసిందిగా ఉత్తరువులు జారీ చేస్తూ ఉంటారని వేరే చెప్పనవసరంలేదు. క్రమశిక్షణకి బద్ధులయిన పోలీసువారు ఇటువంటి ఉత్తరువులని శిరసావహించకుండా ఉండలేరు. విద్యార్థులు, తదితరులు బస్సులు, కట్టడాలు, రయిల్వే ఆస్తులు—వాటిని నాశనం చేస్తూ ఉంటే వీరు చూస్తూ ఊరుకుని ఉండవలసిందే.

ఈ ధోరణి 'నిస్సహాయ' మయినదని అలజడిచేసేవారు తప్పుగా అర్థం చేసుకొనడం తరువాత జరిగేది. [లేదా కొన్ని వర్గాలవారు అలజడిచేసేవారిని అమితంగా రెచ్చగొడుతూ ఉంటారు.]

అప్పుడు అలజడిచేసేవారు తమ వస్తు విధ్వంసాన్ని ఆపి తమ కోపాన్ని తమ ఆగ్రహానికి గురి అయిన మనుషులమీదా, పోలీసువారిమీదకూడా చూపిస్తారు.

ఇక పోలీసులు ఉదాసీనంగా ఉండటం ఎలా సాధ్యం అవుతుంది?

వారు కూడా రంగంలోకి దిగవలసి వస్తుంది. సామాన్యప్రజలు వీరి ధాటికి తట్టుకోలేకపోవటం సహజమే! సాయుధులయిన పోలీసువారిని కొట్టటం, వారిమీద రాళ్ళు విసరటం—బస్సులని తగలపెట్టటం, మామూలుజనాన్ని కొట్టటం అంత తేలికకాదు!

చివరికి వారికే వారి దౌర్జన్యకృత్యాల ఫలితం తెలుస్తుంది. ఆవేశంలో ముందుకి దూకినవారు కొందరు భయవిహ్వలులయి పారిపోవటం లేదా సహనం పూర్తిగా కోల్పోయిన పోలీసు లాఠీదెబ్బలకి గురి అవటం జరుగుతుంది.

అలజడి చేసేవారి సంఖ్య మరీ పెద్దదయితే తమ ఆత్మసంరక్షణకోసం పోలీసువారు తుపాకీకాల్పులుకూడా చేసి తీరవలసి వస్తుంది. ప్రమాదవశాత్తు కొందరు అమాయకులు ఆత్మసంరక్షణకోసం చేసిన ఈ కాల్పులకి బలి కావచ్చు. సాధారణంగా ఎంతటి వీరుల బృందమయినా ఇంతటితో చల్లబడిపోవటం జరుగుతుంది.

కాని, అతిత్వరలోనే 'పోలీసు దౌర్జన్యా'లనే నినాదాలు లేస్తాయి. సాధారణంగా పోలీసు సంరక్షణలు కోరేవారే ఇటువంటి సమయాలలో పోలీసువారి క్రౌర్యాన్ని తూలనాడుతారు!

ఉద్యమాన్నిదౌర్జన్యమార్గం తొక్కించే నాయకులు వంతపాడటం సహజం. ఎంత ప్రచారం పొందగలిగిన 'పోలీసుదౌర్జన్యా'ల నినాదాన్ని వారు తమ ఆగ్రహానికి గురిఅయిన వారిమీద మరికొన్ని అత్యాచారాలనిజరిపేందుకు వాడ ప్రయత్నించటం మరింతసహజం.

ఎవరూ ఏ తప్పూ చెయ్యకపోతే చట్టాలూ, దండనలూ, సంరక్షకులూ—వీరెవరూ అవసరంలేదు! కాని, ఇది యదార్థ ప్రపంచం కాబట్టి సమాజంలో శాంతిభద్రతలని కాపాడే పోలీసువారిని రాజకీయాలకోసం వాడుకొనటం అరాజకానికి దారి తియ్యటమే అవుతుంది.

—ఒక ప్రత్యేక విలేఖరి.



ఎపోలో—11 అమెరికన్ అంతరిక్ష నావికులు భూమికి తెచ్చిన చంద్రుని గడ్డ.

# వర్తించని లోకోక్తి

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన కొత్తలో ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 'ఆంధ్రుడు ఎడమిల్లేనుంచి జాగానహీకి పురోగమించాడని' ఒక వ్యాసకర్త వ్రాశాడు. ఔను! ఆంధ్రుడు ఆంధ్రుడుగా బ్రతికింది 1953 అక్టోబర్ 1 నుంచి, 1956 అక్టోబర్ 31 వరకూ మాత్రమే! తిరిగి తనదైన ప్రాంతములో తాను గర్వంగా బ్రతకడానికి ఆంధ్రుడు ఇకనైనా నిశ్చయించుకోవాలి.

ఈ రోజున ప్రత్యేక తెలంగాణా కావాలని ఆ ప్రాంత ప్రజలు ముమ్మరంగా ఏడు నెలలబట్టి ఉద్యమానికి ఊపిరి అందిస్తున్నారు. ఆ ప్రాంతంలో వ్యాపారం స్తంభించిపోయింది. విద్యాలయాలు మూతపడ్డాయి. శాంతి భద్రతలు లోపించాయి. ఇది ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి ప్రబల నిదర్శనమని ఎవరయినా ఒప్పుకుంటారు. ఈ ఉద్యమానికి తెరముందర, తెర వెనుక ఎవరువున్నా అధిక సంఖ్యాకులయిన ఆ ప్రాంతీయుల అండదండలు ఈ ఉద్యమానికి వున్నాయి. అలాగే ఆంధ్ర ప్రాంతీయులు తాము సగర్వంగా బ్రతకడానికి ఎందుకు ముందడుగు వేయడం లేదు? తమ హక్కులు పొందడానికి, రక్షించుకోడానికి ఎందుకు నడుము బిగించడము లేదు? ఆంధ్రప్రదేశ్‌లో తమకి స్థానం లేదని, తమ రాజధాని తమ రాజధాని కాదని ఎందుకు తెలుసుకోవడం లేదు? తాను తెలంగాణా ప్రాంతములో వెలివేయబడ్డాడని ఆంధ్రుడు ఎందుకు గుర్తించుకోవడం లేదు? ఇంకా ఎందుకు ఆంధ్రప్రదేశ్ స్థిరత్వానికి, రాష్ట్ర సమగ్రతకి ఊగిసలాడతాడు. తాను ఎలా ఉద్ధరించబడతాడు ఈ అమాయకుడు?

ఇప్పుడు ఆంధ్రప్రాంతము విడిపోతే రాజధానిలో పరిశ్రమలు నెలకొల్పిన ఆంధ్ర పారిశ్రామికవేత్తలు ఏమవుతారనే ప్రశ్న ఉదయించవచ్చు. అక్కడ స్థిరపడ్డ ఆంధ్రులు ఏమవుతారనే భయం పొడసూపవచ్చు. దేశంలో ఏ ప్రాంతీయుడయినా ఇంకొక ప్రాంతములో బ్రతకడానికి, ఆర్థిక స్వాతంత్ర్యము అనుభవించడానికి హక్కు వుంది. ఈ హక్కుని కాదనే హక్కు ఎవరికీ లేదు. తెలంగాణా ప్రజలకి కావలసినది రాజకీయ స్వాతంత్ర్యము, ప్రత్యేక రాష్ట్రం. ప్రస్తుత ఉద్యమం ప్రత్యేక రాష్ట్ర సాధనతోగాని చల్లారదు. మరి ఇదంతా గుర్తించి ఆంధ్ర ప్రాంతీయులు ఎందుకు చల్లగా వూరుకుంటున్నారు? ప్రత్యేక తెలంగాణా ఏర్పడితే ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం అదే ఏర్పడుతుందనా!

ఆంధ్రరాష్ట్ర జన్మదినం
అక్టోబర్ ఫస్టు
అది త్వరలో వరలు
సువిశాలాంధ్రానికి ట్రస్టు

అన్న ఆంధ్ర అభ్యుదయకవి నమ్మిక నమ్మికాలేదు కర్నూలు నుంచి అలా హైదరాబాద్ వెళ్ళిపోతాము అన్న ప్రకాశం గారి వాక్కు వేదవాక్కు అయింది. కాని ఆంధ్రప్రదేశ్ వచ్చి ఏమి సాధించబడింది? ఏనాడూ తెలంగాణా ప్రాంతీయుడికి ఇష్టం లేని ఈ ఆంధ్రప్రదేశ్ వుండి ఏమి లాభం? తెగిపోయిన ఈ అనుబంధము తిరిగి అతుక్కోదని కేంద్రానికి తెలియదా? అంతకంటె ముందర ఆంధ్రుడికి తెలియదా?

ఈ తెగిపోయిన అనుబంధము అతుక్కోడానికి ఒకే ఒక ఉపాయం వుంది. అది తెలంగాణా, ఆంధ్రప్రాంతాల విడిపోవడమే!

ఆంధ్రప్రదేశ్ సమగ్రత కాపాడా లనుకోవడం ఈ రెండు ప్రాంతాల అభివృద్ధికి గొడ్డలిపెట్టు! ఈ రెండు ప్రాంతాల ప్రజల మధ్య వైషమ్యాలు పెంచడానికి దోహదకారి!!

ఈ సందర్భంలో ఆలోచించవలసిన విషయం మరొకటి వుంది. అవిభక్త 'హైదరాబాద్ రాష్ట్రం'లోని మహారాష్ట్ర, కన్నడ ప్రాంతములు రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ తర్వాత అటు మహారాష్ట్రతోను (అప్పుడు బొంబాయి), ఇటు మైసూరులోనూ విలీనం అయ్యాయి. ఆయా ప్రాంతాలు ఆయా రాష్ట్రాల్లో అంతర్భాగమయాయి. అక్కడ ఏ ఉద్యమమూ తలెత్తలేదు. కానీ తెలంగాణా ఆంధ్రప్రాంతములో ఎందుకు అంతర్భాగం కాలేకపోయింది? ఈ ప్రాంతంలో ఒకే మహానగరం వుండడమే! ఆ నగరం విశాల రాష్ట్రానికి రాజధాని కావడమే!

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం, ప్రత్యేక తెలంగాణా ఏర్పడాలని వాంఛిస్తున్న ఈ వ్యాసకర్త 'కలసివుంటె కలదుసుఖం' అన్న లోకోక్తి ఆంధ్ర తెలంగాణా ప్రజలకి వర్తించదని ప్రగాఢంగా నమ్ముతున్నాడు. సరిగా విడిపోయి రెండు రాష్ట్రాలు 1969 నవంబర్ ఒకటికైనా ఏర్పడాలి.

ఈ సమస్యకి ఒక ఒక పరిష్కారం ఇదే:

శుభస్య శీఘ్రం!
జై ఆంధ్ర!
జై తెలంగాణా!

—అ. ప్రసాదరావు. (మద్రాసు)



చంద్రుని ఉపరితలంపై స్పష్టంగా కనిపిస్తున్న మానవుని ముద్రిత అడుగుజాడలు.

# తెలంగాణా ఉద్యమం - ఒక డైరీ

సేకరణ: ఫాలాక్షుడు

(గత సంచిక తరువాయి)

గురువారం 1—5—69

బోలారంబజార్ - బోలారం స్టేషను మధ్య నిన్న ఒక లోకల్ రైలు మూడవతరగతి స్త్రీల ప్రయాణీకుల పెట్టెను దుండగులు తగుల బెట్టారు పెట్టెలో సీట్లపై పెట్రోలు పోసి నిప్పంటించారని రైల్వే అధికారులు తెలియజేశారు. తెలంగాణా ఉద్యమం సందర్భంలో తగులబెట్టబడిన రైలుపెట్టెలలో ఇది ఐదవది

శుక్రవారం 2—5—69.

చార్మినార్ వద్ద ఒకటవ తేదీ మధ్యాహ్నం, మూడు గంటల సమయాన నిషేధపు ఉత్తర్వులను ఉల్లంఘించినందువల్ల పోలీసులు లాఠీచార్జి, బాష్ప వాయువు ప్రయోగం చేశారు.

శనివారం 3—5—69.

తెలంగాణా కోర్కెల దినం సందర్భంగా జనం రాళ్ళు రువ్వడుకు, దహనకాండకు దిగారు. చార్మినార్‌వద్ద నుండీ రాజ్ భవన్ వరకు గల ఆరుమైళ్ళ ప్రాంతంలోను పోలీసులు లాఠీచార్జి జరిపారు. అనివార్య పరిస్థితులలో జరిపిన కాల్పుల్లో ముగ్గురు మరణించారని, 12 మందికిపైగా గాయపడ్డారని తెలుస్తోంది. ఊరేగింపులో పబ్లిక్ గార్డెన్సు ప్రాంతంలో సుమారు పది, పదిహేను వేలమంది చేరారు. రాజభవన్ దిక్కుగా బయలుదేరిన ఈ ఊరేగింపు దారిలో ఒక గవర్నమెంటు జీపును తగుల బెట్టింది. ఒక మిలిటరీ వ్యానును తగుల బెట్టారు. ఈ రెండూ పూర్తిగా దగ్ధమైపోయాయి. రాజభవన్‌వద్ద పోలీసుల పైనే రాళ్ళురువ్వ నారంభించారు. రైలు కట్టమీద బైఠాయించారు. అమెరికా సాంస్కృతిక కేంద్రంపై రాళ్ళు విసిరారు. గవర్నమెంటు డిస్పెన్సరీకి, ఒక ట్రాన్స్‌పోర్టు కేంద్రానికి, రెండు శకటాలకు నిప్పెట్టారు. ఒక మిలిటరీ శకటం మీద నుండి పెట్రోలు డ్రామును వందగజాల దూరంలో నిప్పుముట్టించి తగలెట్టారు.

శనివారం 3—5—69.

ప్రజాసమితి కార్యకర్తలు నల్లబాడ్జీలు ధరించి దుకాణాలు మూయించారు. ఆబిడ్స్‌లో ఒక హోటలుపై దాడిచేసి సోడాబుడ్లు విసిరారట. నాంపల్లి సమీపంలో ఉన్న ఒక బాలికల పాఠశాలకు నిప్పు పెట్టగా పాఠశాలలో కొంత భాగం దగ్ధమయిపోయింది.

గురువారం 15—5—69.

ఇంతవరకూ ఆంధ్రప్రదేశ్‌లో అంతర్భాగంగా తెలంగాణా ప్రాంతానికి స్వయంపరిపాలనాధికారాన్ని కోరుతూ వచ్చిన లక్ష్మణ్ బాపూజీ మే 14 న స్పష్టంగా ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ, సమర్థిస్తూ ఒక ప్రకటన చేశారు.

శుక్రవారం 16—5—69.

మే 17 వ తేదీ శనివారం తెలంగాణా వీరుల దినంగా పాటించబడుతుందని తెలంగాణా ప్రజా సమితి అధ్యక్షుడు మదన్మోహన్ ప్రకటించారు.

మంగళవారం 20—5—69.

తెలంగాణా ఉద్యమం వల్ల ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పడిన పరిస్థితి విషయంలో కేంద్రం శ్రద్ధాళువు అయి వున్నదని, అయితే ఆ పరిస్థితి కేంద్రం కల్పించుకోగలటువంటి పరిస్థితి కాదని, కేంద్రం అప్పటి పరిస్థితిలో కల్పించుకొనడం సాధ్యంకాదని, ప్రధానమంత్రి ఇందిరాగాంధి బెంగుళూరులో పత్రికా విలేఖరులతో చెప్పారు.

బుధవారం 21—5—69

తెలంగాణా వాదులు పత్రికల వారిని బెదిరిస్తున్నారని,యిది చాలా అన్యాయమనీ ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ ప్రధాన కార్యదర్శి శ్రీనివాసరావు అన్నారు. (హైదరాబాదు) నగరంలో ఫిబ్రవరి నెలలో ఒక పత్రిక కార్యాలయంలోకి జొరబడి తన విధులు నిర్వహిస్తున్న పత్రికా రచయితను బెదిరించారని, కొట్టబోయారని ఆయనన్నారు. మరి ఒక రిపోర్టరు ఇంటిని తగలెట్టే ఏర్పాటు కూడా చేశారని, 18 వ తేదీన విజయవాడ పత్రికల రిపోర్టరును ఆంధ్రప్రదేశ్ సమైక్యతావాది ఒకరు బహిరంగసభలో తంతామని బెదిరించారని, దీనివల్ల పత్రికా స్వాతంత్ర్యము దెబ్బతింటోందనీ ఆయనన్నారు.

తెలంగాణావాదులు ప్రజలను రెచ్చగొట్టే పద్ధతిలో ఉపన్యాసాలిస్తున్నారని, అరాజకంగా వుందని, ఈ రకం ప్రసంగాలు శాంతిభద్రతలు కోరుతూ చట్టానికి కట్టుబడివున్న ఆంధ్రప్రదేశ్ అభ్యుదయకామి ప్రజలకు సవాలువంటిదని—ఆరుగురు పార్లమెంటు సభ్యులు, శాసనసభ్యులు ఒక ప్రకటన చేశారు.

డాక్టర్ చెన్నారెడ్డి రెచ్చగొడుతున్న ప్రచారాలు చేస్తున్నారని, ఆయన ప్రసంగాలు పద్ధతులు అభివృద్ధి నిరోధక ఫాసిస్టు విచ్ఛిన్నకత్వాన్ని ప్రచారం చేస్తున్నాయని వారన్నారు.

గురువారం 22—5—69

తెలంగాణాలోని ప్రతి గ్రామం ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం కోరుతోందని డాక్టర్ చెన్నారెడ్డి అన్నమాటలు వాస్తవం కాదని హైదరాబాదు జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు అన్నారు. ఏ జిల్లాకయితే ఆయన వెళ్తాడో, ఆ జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు, వారి ఆశీర్వచనాలతో ఏర్పాటు అయినటువంటి జిల్లా కాంగ్రెసు సభ్యులు, ఆంధ్రప్రదేశ్ సమైక్యతనే కాంక్షిస్తున్నారు. ఈ గొడవల్లో అనేకమంది రైతులు, పనివారు నలిగిపోతున్నారనికూడా ఆయన అన్నారు

శుక్రవారం 23—5—69

తెలంగాణా ప్రాంతంవారు ఆంధ్రప్రదేశ్ నుంచి విడిపోదల్చుకుంటే విడిపోవచ్చునని, అయితే యిది స్నేహపూర్వకంగా చూసుకోవాలి గాని, తోటి సోదరులైన ఆంధ్రప్రాంతం వారిపై దుర్భాషలు సాగించి సాధిస్తామనడం మంచి పద్ధతి కాదని స్వతంత్రపార్టీ నాయకుడు శ్రీ రంగా అన్నారు.

తెలంగాణా ప్రజాసమితికి డాక్టర్ మర్రి చెన్నారెడ్డి మొన్న ఏకగ్రీవంగా (20 తేదీన) అధ్యక్షుడుగా ఎన్నికైనారు.

శనివారం 24—5—69

మే 26 నుంచి తెలంగాణా ప్రత్యేక

రాష్ట్ర సాధనకోసం రెండవ ఘట్టం పోరాటం ప్రారంభమవుతుందని తెలంగాణా ప్రజాసమితి అధ్యక్షపదవి స్వీకరించిన సందర్భంలో డాక్టర్ చెన్నారెడ్డి పత్రికా విలేఖరులతో అన్నారు. రాజధాని నగరంలోను, తెలంగాణా తొమ్మిది జిల్లాలలోనూ ప్రజలు అప్పటినుంచి (26 నుంచి) తెలంగాణా మంత్రులపై సత్యాగ్రహము, ధరణా ప్రారంభిస్తారని, పునఃనిరశన వ్రతాలు కూడా ప్రారంభమవుతాయని ఆయనన్నారు.

ఆదివారం 25—5—69.

తెలంగాణా ప్రదేశ్ కాంగ్రెసు సంఘాన్ని ఏర్పాటు చేయడానికి తెలంగాణా కాంగ్రెసువాది ప్రత్యేక రాష్ట్రవాదుల సదస్సు ఒకటి జూన్ ఒకటవ తేదీన రాజధానిలో జరుగనున్నదని కొండా లక్ష్మణ్ అన్నారు.

సోమవారం 26—5—69

డాక్టర్ చెన్నారెడ్డి ప్రకటించిన రెండవ ఘట్టం పోరాటం— సత్యాగ్రహం కార్యక్రమము, వంతులవారీ నిరాహారదీక్షలను కార్యవర్గం ఆమోదించింది. మే 29 మహమ్మదీయులకు పవిత్రదినం గనుక వారి కోరికను పురస్కరించుకుని ఆ రోజు ఆందోళన కార్యక్రమం నిర్వహించకూడదని నిశ్చయించింది.

హైదరాబాదుకు 50 మైళ్ళ దూరంలో వున్న జడ్చర్లలో దౌర్జన్యానికి దిగిన మూకపై, పోలీసులు కాల్పులు జరిపినట్లు హైదరాబాదుకు అందిన సమాచారాన్ని బట్టి తెలిసింది. ఈ కాల్పులలో నలుగురు గాయపడ్డారు. రాళ్ళ దెబ్బలు తగిలిన ఒక ఇన్స్‌పెక్టరును ఆసుపత్రిలో చేర్చారు.

గురువారం 29—5—69.

ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల మధ్య యింకా విరోధ భావం పెంపొందక ముందే ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి ప్రతిష్ఠ కోసం ప్రాకులాడక, ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పాటు కోసం, వెంటనే చర్య తీసుకోవాలి అని తెలంగాణా ప్రజాసమితి అధ్యక్షుడు డాక్టర్ చెన్నారెడ్డి గాంధీ భవన్‌లోని ప్రకాశం హాలులో తెలంగాణా నాన్‌గెజెటెడ్ వుద్యోగస్తుల సమావేశంలో మాట్లాడుతూ, అన్నారు.

ప్రత్యేక తెలంగాణా ఆందోళనపరులు 28 వ తేదీన నల్లకుంటలో మున్సిపల్ కౌన్సిలర్, సమైక్య సంఘ జాయింటు సెక్రటరీ యాదగిరి యింటికి నిప్పు పెట్టారు. మధ్యాహ్నం కొంతమంది విద్యార్థులు ఆయన యింటి మీద దాడి చేసి, ఇంట్లో ఫర్నిచర్, తదితర వస్తువులను తగులబెట్టారట. ఈ కాండలో విద్యార్థులు గుండాల సహాయం తీసుకున్నారట. ఆయనకి చాలా నష్టం చేశారట.

సమైక్యతకోసం పనిచేస్తున్న విద్యార్థి నాయకుడు ఇంద్రసేన్ రెడ్డి యింటిపైన కూడా దాడిచేసి, ఇంట్లోని ఆడవారిని కొట్టారట.

సోమవారం 2—6—69.

తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలనే వాదాన్ని భారతీయ క్రాంతిదళ్ (మే 29న ఢిల్లీలో) సమర్థించింది. ఒక తీర్మానం చేస్తూ తెలంగాణా ప్రజల్లో పెరుగుతున్న అసంతృప్తి యిప్పుడు అవధులు దాటిందని కొత్త రాష్ట్రం ఏర్పాటు వల్ల ఆ రాష్ట్రానికి ఎంతో అవసరమైన శాంతి, తగు అభివృద్ధి చేకూరగలవని అభిప్రాయపడింది.

మంగళవారం 3—6—69

సమైక్య సంఘంలో చురుకుగా పనిచేస్తున్న శ్రీ మల్లిక్ సోదరుడు వెంకయ్యను సజీవదహనం చేయడానికి ప్రత్యేక తెలంగాణావాదులు ప్రయత్నించినట్లు తెలుస్తోంది. వంటిమీద కిరసనాయిలుపోసి, నిప్పంటించినందువల్ల వొళ్లు కాలిన ఆయన్ను ఉస్మానియా ఆసుపత్రిలో చేర్చారు.

కరీంనగర్ జిల్లా మంతెనలో సమైక్యవాదులకు చెందిన ఒక జీపును విద్యార్థులు తగులబెట్టినట్లు వార్త అందింది. జీపు టాపు, సీట్లు తగులబడిపోయాయి.

మెదక్ జిల్లా దుబ్బాక్‌లో నిన్న ప్రత్యేక తెలంగాణా వాదులు ఒక ఆఫీసుకు నిప్పు పెట్టాలని, ప్రయత్నించారు.

తెలంగాణా ఆందోళకులు 2 వ తేదీ ఉదయం గుంపులు గుంపులుగా బస్సులపైన లారీలపైన రాళ్ళు గిరాటు వేసినపుడు ఇద్దరు కానిస్టేబుల్సు గాయపడ్డారు. ఒక పోలీసు లారీ కూడా దెబ్బతిన్నది.

హైదరాబాద్‌లో పుత్లిబౌలి ప్రాంతంలో ఉద్రిక్తులైన ప్రజలు (ఆందోళకులు) పోస్టాఫీసుకు నిప్పంటించిన సందర్భంగా పోలీసులు కాల్పులు సాగించారు. హనుమకొండ పోస్టాఫీసు వద్ద జనం గుమిగూడి లోపల పని చేస్తున్న సిబ్బందిని బయటికి రమ్మని అన్నారని, వారందుకు తిరస్కరించగా జనం పోస్టాఫీసు మీద రాళ్ళు విసిరారని అన్నారు.

గురువారం 5—6—69.

ప్రత్యేక తెలంగాణా వాదులు దౌర్జన్యాలు, గృహదహనాలు హద్దు మీరి పోవడంతో రాత్రి 10 గంటల నుంచి 11 గంటల వరకూ హైదరాబాదులో కర్ఫ్యూ విధించబడినది. 3 వ తారీఖున దౌర్జన్యాల అణచడానికి జరిపిన కాల్పులలో (11 సార్లు జరిపిన కాల్పులలో) ఆరుగురు మరణించినట్లు, 32 మంది గాయపడినట్లు అధికారులు, తెలుపగా కనీసం 13 మందైనా చనిపోయి వుంటారని అనధికార వార్తలంటున్నాయి.

హైదరాబాదులో రాళ్ళు రప్పలు విసరడం వల్లను పోలీసు లాఠీచార్జీల వల్లను పిల్లలూ, స్త్రీలతో సహా చాలామందికి దెబ్బలు తగిలాయి.

దౌర్జన్యకారులు ఆంధ్ర పత్రిక కార్యాలయంపైన దాడిచేసి కార్యాలయం బయట పేరున్న బోర్డును తగులబెట్టారు. టెలిప్రింటరు, టెలిఫోను తీగలు పాడుచేశారు.

4 వ తేదీన హైదరాబద్, సికింద్రాబాద్‌లలో దౌర్జన్యాలు కొనసాగిన సందర్భంగా జరుపబడిన పోలీసు కాల్పులలో ఆరుగురు మరణించినట్లు తేలింది. తుపాకీ గుళ్ళ దెబ్బలతో చికిత్స కోసం 17 మంది ఉస్మానియా ఆసుపత్రిలో చేర్చబడ్డారు.

శుక్రవారం 6—6—69.

కర్ఫ్యూ పెట్టాక కూడా హైదరాబాదులో దౌర్జన్యకాండలు తగ్గలేదు. సికిందరాబాదులో సుమారు 50 మంది ఒక టెలిఫోను స్తంభాన్ని రోడ్డు కడ్డంగా పడగొట్టి ఆ పక్కనున్న కంటోన్మెంటు డిస్పెన్సరీపై దాడిచేశారు. ఈ విధ్వంస కాండలో ఎలక్ట్రిక్ సబ్‌స్టేషను తగులబెట్టినందువల్ల నగరంలో చాలా భాగం అంధకారం అయిపోయింది. శకటాలు, పోస్టాఫీసులు, షాపులు మొత్తం మూడు తగులబెట్టినట్లు తేలింది.

కాజీపేట బల్లార్షా రైలుమార్గంలోని హసన్‌పర్తి స్టేషనును తెలంగాణా ఆందోళకులని అనుమానింపబడిన ఓ 50 మంది తగులబెట్టినట్లు (5 రాత్రి) వార్తలందాయి. ఒక హోటలుపై దాడి చేసి రాళ్ళు విసరడంతో దొడ్డిపల్లి రాజగోపాలరావు అనే ఆయన కన్ను దెబ్బతిన్నది.

శనివారం 7—6—69

3 వ తేదీ రాత్రి హైదరాబాదుకి తొమ్మిదిమైళ్ళ దూరంలో వున్న కుండపూర్‌లో రెండువందల మందిపైగా జనం ఒక గ్రామాధికారిపై దాడిచేసి, యజమాని యింటిపై రాళ్ళురువ్వి ఒక వ్యక్తిని చంపి, ముగ్గుర్ని తీవ్రంగా గాయపరచారు.

ఆదివారం 8—6—69.

డాక్టరు చెన్నారెడ్డి యిలా అన్నారు : ప్రధాన మంత్రి అభిప్రాయాలు అలాగే వుండి హృదయ పరివర్తన లేకపోతే ఆందోళన కొనసాగుతుంది. ఇతరుల అభిప్రాయాలు ఏమైనా తెలంగాణా ప్రజలకు సంబంధించినంతవరకూ తెలంగాణా రాష్ట్ర నిర్మాణం తప్ప మరొక అభిప్రాయంలేదు. కేంద్ర నాయకులచే పదే పదే అటువంటి ప్రకటనల వలన హాని ఎక్కువ అయి ఆంధ్రప్రదేశ్— తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలుగా విడిపోవలసిన ముహూర్తం దగ్గర పడుతున్నది! రేపు వుదయం ఆరు గంటలకు కర్ఫ్యూను పొడిగించినట్లయితే బాహాటంగా కర్ఫ్యూను ఉల్లంఘించాలని సమితి

నెం 52 లో 4 గురు ఆల్ కరెక్టు విజేతలు ఒక్కొక్కరు 6500 పొందిరి. మిని B లో 14 విజేతలు ఒక్కొక్కరు రు. 715 పొందిరి. ఒక్క తప్పుతో పంపిన 42 విజేతలు ఒక్కొక్కరు రు. 240 పొందిరి.

# LITQUIZ NO. 54

# Rs. 65,000

| 1ST PRIZE | 2ND PRIZE | MINIQUIZ |
|---|---|---|
| Rs. 28,000 | Rs. 10000 | 1ST PRIZE Rs. 10,000 |
| | | RUNNERS-UP (UPTO 3 ERRORS) Rs. 6,500 |

RUNNERS-UP (UP TO 4 ERRORS) Rs. 9,000 — SUBSCRIBERS PRIZE Rs. 1500

—: ముఖ్యాంశములు :—

1. మొదటి బహుమతి మొత్తం పెంచబడింది.
2. మినిక్విజ్ క్లూలు తగ్గించబడినవి

ఎప్పుడైనా, ఎక్కడైనా లిట్‌క్విజ్ మీకు ప్రశాంతతనిచ్చును.

## లిట్‌క్విజ్ నెం. 54 అధికార ఎంట్రీ ఫారము

ఆఖరు ముగింపు తేది 10-9-69 బుధవారం

ADDRESS: LITQUIZ No. 54 ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)

గమనిక: 1) ఒక్కొక్కకాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P. O. క్రాస్‌చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 54, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| | Re 1 క్లూలు 1 | | | Re 1 క్లూలు 2 | | | Re 1 క్లూలు 3 | | | Re 1 క్లూలు 4 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACT | AIM | 1 | ACT | AIM | 1 | ACT | AIM | 1 | ACT | AIM |
| 2 | ACTIVITY | AGILITY | 2 | ACTIVITY | AGILITY | 2 | ACTIVITY | AGILITY | 2 | ACTIVITY | AGILITY |
| 3 | AGRESSION | REGRESSION | 3 | AGRESSION | REGRESSION | 3 | AGRESSION | REGRESSION | 3 | AGRESSION | REGRESSION |
| 4 | AMITY | EQUALITY | 4 | AMITY | EQUALITY | 4 | AMITY | EQUALITY | 4 | AMITY | EQUALITY |
| 5 | COMPETENCE | INTELLIGENCE | 5 | COMPETENCE | INTELLIGENCE | 5 | COMPETENCE | INTELLIGENCE | 5 | COMPETENCE | INTELLIGENCE |
| 6 | CONFIDENCE | COURAGE | 6 | CONFIDENCE | COURAGE | 6 | CONFIDENCE | COURAGE | 6 | CONFIDENCE | COURAGE |
| 7 | DEATH | FAITH | 7 | DEATH | FAITH | 7 | DEATH | FAITH | 7 | DEATH | FAITH |
| 8 | HUMANE | HUMBLE | 8 | HUMANE | HUMBLE | 8 | HUMANE | HUMBLE | 8 | HUMANE | HUMBLE |
| 9 | LEARNING | LIFE | 9 | LEARNING | LIFE | 9 | LEARNING | LIFE | 9 | LEARNING | LIFE |
| 10 | MARRIAGE | MORALITY | 10 | MARRIAGE | MORALITY | 10 | MARRIAGE | MORALITY | 10 | MARRIAGE | MORALITY |
| 11 | PERFECT | PURE | 11 | PERFECT | PURE | 11 | PERFECT | PURE | 11 | PERFECT | PURE |
| 12 | POWER | PREJUDICE | 12 | POWER | PREJUDICE | 12 | POWER | PREJUDICE | 12 | POWER | PREJUDICE |
| 13 | PROGRESS | PURPOSE | 13 | PROGRESS | PURPOSE | 13 | PROGRESS | PURPOSE | 13 | PROGRESS | PURPOSE |
| 14 | SALVATION | SATISFACTION | 14 | SALVATION | SATISFACTION | 14 | SALVATION | SATISFACTION | 14 | SALVATION | SATISFACTION |
| 15 | SECURITY | STABILITY | 15 | SECURITY | STABILITY | 15 | SECURITY | STABILITY | 15 | SECURITY | STABILITY |
| 16 | SERENITY | SIMPLICITY | 16 | SERENITY | SIMPLICITY | 16 | SERENITY | SIMPLICITY | 16 | SERENITY | SIMPLICITY |
| 17 | STRIFE | SUFFERING | 17 | STRIFE | SUFFERING | 17 | STRIFE | SUFFERING | 17 | STRIFE | SUFFERING |
| 18 | TALENT | TASTE | 18 | TALENT | TASTE | 18 | TALENT | TASTE | 18 | TALENT | TASTE |

54 FREE AFTER 4 COUPONS — MINIQUIZ




| ACT | AIM | CONFIDENCE | COURAGE |
|---|---|---|---|
| ACTIVITY | AGILITY | DEATH | FAITH |
| AGRESSION | REGRESSION | HUMANE | HUMBLE |
| AMITY | EQUALITY | LEARNING | LIFE |
| COMPETENCE | INTELLIGENCE | MARRIAGE | MORALITY |

3/G/ANNUAL SUB. No. ______ NEW ______

ఈ క్విజ్ ప్రచురణను ఎవెంటిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/—. ఈ పూర్తి ఎంట్రీఫారము (4 కూపనులకు) ఫీజు గు 4/—M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.........

54 (ASVP)

CAPITAL LETTERS

NAME.............................................

.....................................................

ADDRESS ......................................

.....................................................

.....................................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించిపంపవలెను

ఆఖరు ముగింపు తేది: 10—9—69.
ఫలితాలు ఆంధ్రప్రభ. తేది: 14-9-69.
* ఫలితాలు వెంటనే పొందుటకు 10 పైసల స్టాంపు, స్వంత అడ్రసు గల కార్డును వెంటనే పంపవలెను.

లిట్‌క్విజ్ పక్షపత్రిక, పాత మరియు క్రొత్త చందాదారులు 4వ కూపనులోని చివరి 4 క్లూలకు సరియైన జవాబులు ఇచ్చినయెడల, రు. 1500 లను 1 : 2 నిష్పత్తిలో పంచుకొనెదరు. తేది 21—8—69 నుండి 10—9—69 వరకు, ఈ కాలములో చందాలు పంపినవారు క్రొత్త చందాదారులు. వారు 'మినిక్విజ్' క్రింద ఇవ్వబడిన 'క్రొత్త' అను పదమునకు పైగా కొట్టవలెను. 'పాత' చందాదారులు తమ చందా నెంబరు వ్రాయవలెను.

# విగ్రహాల తస్కరణ

లక్ష రూపాయల ఖరీదు చేసే పంచలోహాల విగ్రహాలు మూడు — తిరుచ్చికి చెందిన ఒక పురాతన ఆలయం లోంచి ఓ ఇద్దరు యువకులు తస్కరించారట. ఈ మూడు విగ్రహాలూ చోళుల కాలం నాటివట. తస్కరించిన యిద్దర్నీ పోలీసు పట్టుకుంది.

# 40 హత్యల వివరాలు బయటపెట్టడానికి హారక్యాత్వరాలు!

తనని ఒక సంవత్సర కాలం స్వేచ్ఛగా వుండనిస్తే, తను గత 20 సంవత్సరాలలో చేసిన దారుణ హత్యలను వెల్లడి చేస్తానని, బొంబాయిలో చేసిన



40 హత్యలూ వివరాలతో బయట పెడ్తానని రామన్ రాఘవ్ బొంబాయి కోర్టును కోరాడట. పోయిన సంవత్సరం ఆగష్టులో చేసిన రెండు హత్యలనూ కళ్లారా చూసిన సాక్ష్యులు పట్టివ్వగా అతను చట్టానికి పట్టుబడ్డాడట. తనకు ఒక సంవత్సరం స్వేచ్ఛని యివ్వడమే గాక, తనకు స్త్రీసుఖం కూడా కావాలని, కనుక ఒక అమ్మాయిని కూడా యివ్వాలని, ఆ అమ్మాయికి ఒక 75 ఏళ్ళ ముసలమ్మను కాపలా యివ్వాలని ఒక పోలీసు ఇన్‌స్పెక్టరుగాని, లేక యిద్దరు కానిస్టేబుళ్ళుగాని, ఒక సాయుధ పోలీసు, ఒక జీపు, దేశంలో ఏ మూలకైనా తిరిగి రావడానికి విమాన రైల్వే పాసు, తగిన ధనం యివ్వాలని అడిగాడట. తన పాపకృత్యాలన్నీ యావత్ ప్రపంచానికి తెలియజేసి, శిక్ష విధించే హక్కు ప్రజలకు వదలాలని అన్నాడట. తనకు సంవత్సర కాలంలో యిచ్చిన స్త్రీని తిరిగి యిచ్చేస్తానన్నాడట— వాడి పండగే

* * *




తూర్పు గోదావరి జిల్లా ముమ్మిడివరం సబ్ ఇన్‌స్పెక్టర్ శ్రీ జె. సుబ్బారావు 100 రూపాయలు లంచం తీసుకుంటుండగా నేరనిరోధకశాఖ వారు ఆయన్ని అరెస్టు చేశారు.

# తప్పిపోయిన పిల్లలు!

బొంబాయి నగరంలోని ఒక పోస్ట్‌మాన్ తన ఇద్దరు పిల్లలూ కనబడటం లేదని పోలీసు రిపోర్టిచ్చాడట. ఇటువంటి ఫిర్యాదులే మరికొన్ని వుండటంవల్ల పోలీసు యీ విషయంలో ఆరా తీసేసరికి మొత్తం 172 మంది పిల్లలు దొరికారట. ఇంతకీ ఆ పోస్ట్‌మాన్ పిల్లలు మాత్రం దొరకలేదట. వీరిలో 75 మంది పిల్లలను వారి వారి తల్లిదండ్రులకు అప్పచెప్పారట. మిగతా వారి తల్లిదండ్రులకోసం వెతుకుతున్నారట.

నా పిల్లల అడ్రసు తెలీలేదు సార్!!



# లారీ ప్రమాదం

ఓ తాగుబోతుని రోడ్డు మీదకు వచ్చి, [illegible] తెక్కిన వెంకటయ్య అనే 40 ఏళ్ళ అతనిని ఓ లారీ (దిండివనం ప్రాంతం) గుద్దిందట. దాంతో అతను ఎగిరి పడ్డాడట. లారీ డ్రయివరు యీ సంఘటనతో బ్రేకు గట్టిగా నొక్కేసరికి ఆ ప్రాపు లారీ తొట్లక్రిందనుంచి క్రింద పడ్డ వెంకటయ్య మీద పడ్డదట. దాంతో అతను నలిగి చనిపోయాడట.

# స్నానం చెయ్యకపోతేనే అధిక ఆరోగ్యం!

రోజూ రెండు సార్లు స్నానం చేసే వాడికన్నా వారానికోసారి స్నానం చేసేవాడే అధిక ఆరోగ్యాన్ని కలిగి వుంటాడట. స్నానం చేయడంవల్ల బయటికి హాయిగా కనిపించినా అట్టే స్నానాలు మన శరీరం మీదున్న బాక్టీరియాను అధికం చేస్తాయని, స్నానం ఎప్పుడైనా ఏడు వారంకన్నా బాక్టీరి

స్నానమా! పిచ్చిదానా! ఆరోగ్యం చెడిపోద్ది!



యాను నిర్మూలించలేదని, ఒక నెల్లాళ్ళలో ఒకసారి సద్ది స్నానం చేయడం వల్ల బాక్టీరియా అధికమవుతుందని డాక్టర్ డాల్ రిబర్ట్‌సన్‌గారన్నారట. ఈయన యు. ఎస్. ఏ. లో అటామిక్ యూనివర్సిటీకి చెందిన డాక్టరట. కనుక వో మానవుడా నీవూ ఆరోగ్యాపేక్షకలవాడవై స్నానమాచరింపకయే యుండుము.

* * *

తన భర్త తాగుడుకు బానిస అయిన కారణాన్న మంగర్త అమ్మాళ్ అనే ఆమె భర్తను వదిలి తన పుట్టింటికి వెళ్ళిపోయిందట. దాంతో కృష్ణ, గౌండర్ (ఆమె భర్త) అత్తారింటికి వెళ్ళి భార్యను తనతో రమ్మన్నాడట. నిరాకరించేసరికి గమ్మున కత్తి తీసి ఆమెను పొడిచి చంపేశాడట. ఇది సిర్కెష్టపాళయంలో జరిగింది.

* * *

## హత్యా, దోపిడీ

60 ఏళ్ళ వెంకట నరసమ్మను 50 ఏళ్ళ వాడపల్లి రామలక్ష్మమ్మ అనే ఆమెను పోయిన ఆరవ తేదీ రాత్రి ఎవరో పొడిచి చంపేసి, ఇనప్పెట్టి పగలు కొట్టి అందులో వున్న నగలు, ఇతర వస్తువులు దోచుకు పోయారట. ఇది విజయనగరంలో జరిగింది. ఈ హత్యలు కేవలం దొంగతనం సక్రమంగా జరిగేటందుకే చేయబడ్డాయనీ, ఆ ఇద్దరూ వడ్డీ వ్యాపారం చేసే వారినీ పోలీసు అంటోంది.

* * *

మద్రాసు జనావరానికి చెందిన 10 ఏళ్ళ మంగ అనే అమ్మాయి నరదాకి నూతిలో నీరు తోడుతుండగా తాడు కాళ్లకి చిక్కుకుని నూతి లోకి లాగేసిందట. నూతిలో పడి ఆ పిల్ల చని పోయింది.

* * *

నేను బ్రతికి వుండగా చంద్రమండలంలో మానవుడు అడుగు పెట్టే నరిసరి, లేకపోతే ఆ పై లోకం నుంచే చూస్తాను. ఈ పాటి పూగే కుర్చీలో కూర్చుని హాయిగా చూస్తాను. ఇక్కడ నుంచి కన్నా, అక్కడ నుంచే బాగా కనుపిస్తుంది అన్నారట ఒకనాడు ఏదో సందర్భం మీద మాట్లాడుతూ జాన్. యఫ్. కెనడీ. ఇది 1961 సంవత్సరం మే 25 వ తేదీన జరిగిందట.

---

# విజ్ఞానోదయ సాహిత్య పదావళి 7

## వరంగల్లు.2 (ఆ.ప్ర)

(భారత ఉన్నత న్యాయస్థాన తీర్పు ననుసరించి నిర్వహించబడుచున్న సాహిత్య పోటీ)

మొదటి బహుమతి రు 1000 ఆల్ కరెక్టు మూడవ బహుమతి రు 200 రెండుతప్పులకు
రెండవ బహుమతి రు 400 ఒక తప్పు నాలుగవ బహుమతి రు 150 మూడుతప్పులకు
లఘుపదావళి రు 250 ఆల్ కరెక్టు మాత్రమే (కూపను ఒక్కింటికి ఒక రూపాయిమాత్రమే)

## రు. 2000 తప్పక గెలవండి

ముగింపు తేదీ 6-9-69

ఫలితముల ప్రకటన: 13-9-69

—— ఇది చింపి పంపండి ——

చిరునామా:— విజ్ఞానోదయ సాహిత్య పదావళి - 7, వరంగల్లు-2

**సూచనలు**:—(1) ప్రతి ఆధారములోను మీరు తప్పుఅని భావించిన పదమును సిరాతో కొట్టివేయండి. (2) మీరు నాలుగున్న తక్కువ కూపనులు పంపదలచుకున్నచో మిగిలినవాటిని చింపకుండా అలాగే వుంచి ఈ × గుర్తుతో ఈ చివరనుండి ఆ చివరవరకు కొట్టివేయండి. (3) ప్రవేశశుల్కం M.O. ద్వారా పంపినచో M.O. రశీదు దీనికి తప్పక జతచేయండి. M.O. రశీదులేని కూపనులు పోటీలో చేర్చబడవు. (4) పోస్టల్ ఆర్డరు క్రాస్ చేయకూడదు. దానిమీద కేవలం విజ్ఞానోదయ సాహిత్య పదావళి వరంగల్లు 2 అని మాత్రమే వ్రాయాలి. (5) ఆల్ కరెక్టు లేనియెడల తక్కువ తప్పులున్న కూపనుకు మొదటిబహుమతి లభించును. ఆ క్రమము ననుసరించి మిగిలిన బహుమతులుకూడా మారును. (లఘుపదావళి ఆల్ కరెక్టుకు మాత్రమే) మూడు తప్పులవరకుగల ప్రతి కూపనుకు బహుమతి లభించును. (6) విజేతల పట్టిక కావలసినవారు 0-15 పైసల పోస్టేజిపంపి పొందవచ్చును. (7) తెల్ల కాగితముపై పదములు వరుసక్రమములో వ్రాసి పంపినను అంగీకరించబడును. (8) మిగిలిన నియమములు మామూలే.

| ① | ఒక రూపాయి | | ② | ఒక రూపాయి | | ③ | ఒక రూపాయి | | ④ | ఒక రూపాయి | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | పెన్సిల్ | సముద్రం | 1 | పెన్సిల్ | సముద్రం | 1 | పెన్సిల్ | సముద్రం | 1 | పెన్సిల్ | సముద్రం |
| 2 | నైతిక | ఆధ్యాత్మిక | 2 | నైతిక | ఆధ్యాత్మిక | 2 | నైతిక | ఆధ్యాత్మిక | 2 | నైతిక | ఆధ్యాత్మిక |
| 3 | ధన | బల | 3 | ధన | బల | 3 | ధన | బల | 3 | ధన | బల |
| 4 | ప్రపంచం | భారత దేశం | 4 | ప్రపంచం | భారత దేశం | 4 | ప్రపంచం | భారత దేశం | 4 | ప్రపంచం | భారత దేశం |
| 5 | పతనమై | అపమర్దమై | 5 | పతనమై | అపమర్దమై | 5 | పతనమై | అపమర్దమై | 5 | పతనమై | అపమర్దమై |
| 6 | జాతీయ | అంతర్జాతీయ | 6 | జాతీయ | అంతర్జాతీయ | 6 | జాతీయ | అంతర్జాతీయ | 6 | జాతీయ | అంతర్జాతీయ |
| 7 | కళ్యాణము | సమైక్యము | 7 | కళ్యాణము | సమైక్యము | 7 | కళ్యాణము | సమైక్యము | 7 | కళ్యాణము | సమైక్యము |
| 8 | చదువు | విజ్ఞానం | 8 | చదువు | విజ్ఞానం | 8 | చదువు | విజ్ఞానం | 8 | చదువు | విజ్ఞానం |
| 9 | విచిత్ర | ఉన్నత | 9 | విచిత్ర | ఉన్నత | 9 | విచిత్ర | ఉన్నత | 9 | విచిత్ర | ఉన్నత |
| 10 | ఆరోగ్యాన్ని | మంచితనాన్ని | 10 | ఆరోగ్యాన్ని | మంచితనాన్ని | 10 | ఆరోగ్యాన్ని | మంచితనాన్ని | 10 | ఆరోగ్యాన్ని | మంచితనాన్ని |
| 11 | మిత్ర | బంధు | 11 | మిత్ర | బంధు | 11 | మిత్ర | బంధు | 11 | మిత్ర | బంధు |
| 12 | స్వార్థానికి | అన్యాయానికి | 12 | స్వార్థానికి | అన్యాయానికి | 12 | స్వార్థానికి | అన్యాయానికి | 12 | స్వార్థానికి | అన్యాయానికి |

ప్రతి రెండు కూపనులకు ఒక లఘు పదావళి ఉచితము. ప్రతి రెండు కూపనులకు ఒక లఘుపదావళి ఉచితము

ఉచిత లఘు పదావళి

| | | |
|---|---|---|
| 2 | నైతిక | ఆధ్యాత్మిక |
| 3 | ధన | బల |
| 4 | ప్రపంచం | భారత దేశం |
| 5 | పతనమై | అపమర్దమై |
| 6 | జాతీయ | అంతర్జాతీయ |

వి.సా.ప. 7

ఉచిత లఘు పదావళి

| | | |
|---|---|---|
| 2 | నైతిక | ఆధ్యాత్మిక |
| 3 | ధన | బల |
| 4 | ప్రపంచం | భారత దేశం |
| 5 | పతనమై | అపమర్దమై |
| 6 | జాతీయ | అంతర్జాతీయ |

మీ నిబంధనలకు లోబడి ఈ పోటీలో పాల్గొనుచున్నాను. ••• కూపనులకుగాను
రు. .......... మనీ / పోస్టల్ ఆర్డరుద్వారా పంపి నం. .........గల రశీదు జతపరచుచున్నాను.
పేరు ..........................................
చిరునామా ..........................................

—— ఇది చింపి పంపండి ——

### ఆధారములు:

1. జ్ఞానము పెన్సిల్/సముద్రం వంటిది.
2. మానవుడు భౌతిక ప్రపంచంమీద తన శక్తినంతా కేంద్రీకరించడం వల్ల జీవితంలో నైతిక/ఆధ్యాత్మిక విలువలకు చోటులేకుండా పోయింది.
3. ధన/బల వంతులైన వారికి బొగ్గుత్వం కూడా అధికం.
4. ప్రపంచం / భారతదేశం లోని ఉదాత్త మతములన్నీ ముక్తిమార్గాన్ని అభివర్ణించి చెప్పుతున్నవి.
5. భోగాపేక్షఉన్న జాతిపతనమై/అపమర్దమైపోయేందుకుయెంతోకాలంపట్టదు
6. కేవలం ఆర్థిక రాజకీయ సంబంధాలను పెంపొందించినమాత్రానజాతీయ/అంతర్జాతీయసమైక్యమునుసాధించలేము.
7. అన్ని మతాలకు లక్ష్యం విశ్వ కళ్యాణము/ సమైక్యము.
8. చదువు/ విజ్ఞానం అన్నది మనదృక్పథాన్ని పెంచాలి. మనోధైర్యాన్ని ఇవ్వాలి.
9. స్త్రీ హృదయం బహు విచిత్ర/మున్నత మైనది.
10. ఆరోగ్యాన్ని / మంచితనాన్ని శ్రద్ధగా కాపాడుకోవటం మానవుని ప్రథమ కర్తవ్యం.
11. బీదరికంలో ఉండేవాళ్లకిమిత్ర/బంధు వర్గంలో స్థానం అంత మాత్రమే.
12. డబ్బుకూ స్వార్థానికి/అన్యాయానికి లంకె వుంది.

**పదావళి 6 కి సొల్యూషన్**

1. సహించ 2. యుక్తికి 3. ఆకర్షణ 4. కారణం 5. కావేషాలూ 6. ఆరాధించి 7. బ్రతకటం 8. సంస్కృతి 9. యోగ్యత 10. జీవితము 11. ఆశ 12. అసూయా




**వి. జె, వణుకూరు**

స్త్రీలు పురుషులతో సమానంగా పొక్కు కావాలి అంటున్నారు. ఇంటిని తీర్చి దిద్దుకోలేరుగాని వీధిలోకి వెళ్ళి తీర్చి దిద్దుతారా. ఈనాటి స్త్రీలు ఇల్లు, భర్త, పిల్లలు అనేమాటే మరిచి క్లబ్బులకి వెళ్ళడం బాగా ఫాషను అయింది. ఎవరేనా వెళ్ళకపోతే వారిని హేళన చెయ్యడం, పెద్దలు వూరికే అనలేదు ఇంటినిచూసి ఇల్లాలినిచూడు అని. వాళ్ళు ఆ సామెత నిజం చేస్తున్నారు. స్త్రీలు ఇలాచేయడం మంచిదంటారా?

ఏ ఊళ్ళో స్త్రీలు యిలా చేస్తున్నారు జ్యోతీ? 'ఏక గది దివ్యభవంతులని' ఎంతసేపు చూసుకుంటారు? పోనీ అని కళ్ళ కింపుగా అలికి ముగ్గులు పెట్టలేరు కదా గబ్బు కొంపల్ని!.... ఇల్లు చక్క పెట్టుతారు. ఆఫీసులో పని చేస్తారు. ఆఫీసుల్లో తీర్చి దిద్దడా లేమీ ఉండవు— అక్కడ బుఱ్ఱకి పని. స్వతహాగా ఉన్న తెలివి తేటలకి పని. ఇంట్లో దీనికి చోటేది?..... పిల్లా జెల్లా మాట మరిచిన స్త్రీలు ఉద్యోగం చేయరు— హాయిగా భర్తతో కాలక్షేపం చేస్తారు. ఆ పిల్లాజెల్లా భర్తలకి వేడి నీటికి చన్నీరు తోడుగా ఉండాలనే వీధిన బడి ఉద్యోగం చేయడం, వణుకూరులో కూర్చుని క్లబ్బుల కెళ్ళే స్త్రీలని కోప్పడితే ఎలా?... మహిళా మండలులలో అసలు అటెండెన్సు ఉండడం లేదని వాపోతున్నారే— సంఘ సేవికలు. దీనికేం చెప్తావు?

**వై. ఎస్. ఎన్. ఆర్, విజయనగరం**

వివాహమనేది వధూవరుల యిష్టముపై జరుగవలెనని నా అభిప్రాయం. ఇట్లుకాక ఆ వధూవరులలో ఏ ఒకరికి యిష్టములేక పోయిననూ. పెద్దలు బలవంతము చేసినచో ఆవ్యక్తి (పురుషుడుగాని స్త్రీగాని) యొక్క కర్తవ్య మేమిటో తెలుపగోరుతాను.

బలవంతానికి తలవంచక పోవడమే: ఇది ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్ననాడుగాని సాధ్యం కాదని 'విద్యార్థి' పెళ్ళి కొడుకులు గ్రహించాలి.

**టి. ఆర్. కె, పిఠాపురం**

ఆధునిక పతివ్రతకు అర్థం ఏమిటి?

సాయంత్రంపూట చైనాబజారులో పర పురుషుడు తాకకుండా నడవ గల్గిన స్త్రీ! బ్లాకులో బియ్యం కొనకుండా వారంలో అన్నిపూటలా అన్నం వడ్డించకల స్త్రీ!.

**ఎమ్. ఎస్. బళ్ళారి**

ఎడమచేతికి గడియారం, కుడిచేతికి ఒక గాజు, లేక కుడిచేతికి గడియారం ఎడమ చేతికి ఒకేగాజు అలంకరించుకున్న స్త్రీ భారత సాంప్రదాయమేనా లేక లోక ప్రళయానికై అవతరించిన చీడపురుగా?

కొంప ముంచారు! ఆ గాజా గడియారం కూడా లేని చేయి రాస్తున్న దీన్ని మీరు క్షమించకలరా? మూడో కన్ను తెరవకండి శివన్న! నిజంగా చీడ పురుగు అస్తమించ కలదు!

**బి. వి. ఎస్. పి, కరీంనగరు**

నిజంగా మా కుటుంబము నాలెజ్ సీకింగులో చాలా ఆసక్తి చూపిస్తాం... మా అమ్మగారైతే... 'నువ్వు నీ చదువు ఎలాంటిది? శ్రమించి చదువు. క్లాసు తీసుకొనిరావాలి. మరి ఇతర విషయములు నాకుతెలుసు' అంటారు. మీరు అలాగే 'చదువు జాగ్రత్తగా చదువుకొంటూ కథలు వ్రాయి తమ్ముడూ అచ్చవుతాయిలే' అని ధైర్యం చెప్పవలసింది. అలా కాకుండా 'చదువుకోపోవాయ్.' అని గద్దించారు.

మీరు నా ప్రశ్నావళి చదవడం మానేస్తారని యివ్వడం లేదు ఈ జవాబు. మీ పసితనం చూసి జాలేసి యిస్తున్నాను. ఇప్పటికీ నా జవాబు ఒకటే. మొదటి పనులు మొదట అనేదే అది. ఇక నా కసాయి గుండె గురించి బాధపడకండి. క్రమశిక్షణకి ఉరిశిక్ష వేసే రకంది మామేనత్త. ఆవిడ పెంపకంలో పెరిగి చదివిన బాపతు. చదువుకునే టైములో ఎవరేనావస్తే మీ అమ్మగారిలాగా 'బాబూ, అమ్మా' అంటూ లాలించేదా మా అత్తయ్య! రామ రామ! 'కూసేగాడిద మేసేగాడిదని చెరిచిందన్నట్టు— నువ్వెందుకొచ్చావ్?' అని అదరకొట్టి పంపేది. అయినా చదువూ అబ్బింది. స్నేహితులూ నిలిచారు. అందుకే ఆవిడ పద్ధతిలో నమ్మకం ఉంది నాకు.

**ఆర్. బి, ఖర్గపూరు**

ప్రస్తుతం నేను చంటిపిల్ల తల్లిని. మూడవకాన్పు నా ఆరోగ్యం శరీరకంగా చాలా దెబ్బతింది. ఇక ఈకాన్పులు చాలు నాయందు దయతో చికిత్స చేయించుకోమంటే ఇంత కాలంగా నమ్మించుతూ 'ఈసారికి అనడం, మగపిల్లవాడు అనడం' చేయించుకోను అనడం జరుగుతోంది. ఈ ప్రశ్న నన్ను ఎంతో వేధిస్తుంది.

నీ స్థితి నేను అర్థం చేసుకోకలను సోదరీ, కొంచెం తెగింపూ ఓర్పూ చూపించు. ఏ నిరాహార దీక్షో పట్టి వారు చేయించుకున్నా సరే— లేకుంటే నువ్వే వెళ్ళి లూప్ పెట్టించుకు వచ్చారా. అదొక్కటే ప్రస్తుతానికి దారి. విష్ యు గుడ్‌లక్.

**వి. వి. ఆర్. ఎస్, విజయనగరం**

భర్త చెప్పినట్టు వింటూ, భర్తకు అణకువతో యుండి భర్తను సుఖపెట్టడమే కదా భార్య ధర్మం. కాని యిప్పటి భార్యలు భర్తకు లొంగటం అవమానకరంగా భావించి, వారిని లొంగదీసుకుందామని ప్రయత్నించడం వెర్రికదండీ?

భార్యకి లొంగని భర్త లుంటారా, మీ వెర్రి గాని! ఎవరు ఎవరికి లొంగాలన్నది కాదు ప్రశ్న— ఎంత ఆనందంగా బ్రతుకుతున్నారన్నది... అదే కావలసినది.

**ఇ. ఎస్. కె, వరంగల్లు**

భార్యాభర్తలు అప్పుడప్పుడు పోట్లాడుకుంటూ రెందుకు ? పోట్లాడుకోకుండా ఉండాలంటే ఏం చేయాలి?

ఎందుకు పోట్లాడుకో కూడదు? నారేం మామూలు మనుష్యులు కారా? ... సరదాగా ఎప్పుడేనా గట్టిగా దెబ్బలాడు కుంటేనే బాగుంటుంది__ తరువాత ఇదేమిటిలా పైవాళ్ళలాగా దెబ్బలాడుకున్నాం అని నవ్వుకోవచ్చు. ఏమంటారు?

**బి. పి. వి. ఆర్, గుంటూరు**

మీరిద్దరూ స్త్రీలు కావడంవల్ల వివాహం చేసుకోవాలి అని సమాధానం చెప్పారు. కాని...వివాహం చేసుకోకుండా ఉండడమే ఉత్తమం అని ఏ మగవాడైనా సమాధానమిస్తాడు...పెళ్ళి చేసుకొన్న ఐదేళ్ళకల్లా ఎందుకు చేసుకున్నామురా ఈ పెళ్ళి అనుకోని మగవాడెవరు ?

మీ సుదీర్ఘమైన లేఖ సారాంశం— పెళ్ళి చేసుకోవద్దు అనేగా? కానివ్వండి. మీరన్న ఆర్థిక, సాంఘిక విద్యారంగాలలో మీకేం లాభాలు ఒరుగుతాయో వేచి చూస్తాను. తెలియ చేస్తారు కదూ? అర్జున అవార్డులాగా ఏదైనా బ్రహ్మచారి అవార్డు నెలకొల్పే ప్రయత్నాలు చేయిస్తాను. తొలి అవార్డు మీకే..... అప్పటిదాకా మీ యీ స్వేచ్ఛా స్వాతంత్రాలుంటే!!

# బ్రూక్ బాండ్ బ్రూ ఇన్‌స్టెంట్

## క్షణంలో తయారు! కప్పులకొలది సంతృప్తి!

బ్రూ చెయ్యడం అతి సులభం! వేడినీళ్ళు, రుచికై పాలు, పంచదార కలపండి అంతే. నిజమైన కాఫీ చికరీ సువాసనతో మీకు హాయి కొలిపే బ్రూ క్షణంలో తయారవుతుంది!

జ్ఞాపకం ఉంచుకోండి, హడావిడి గాని, గొడవ గాని, వడపోయటంతో సమయనష్టం గాని బ్రూ తో లేదు.

అదీ గాక మీ రుచికి తగినట్లుగా, కప్పుకి కొంత హెచ్చుగా గాని తక్కువగా గాని కలిపి తగురీతిగా చేసుకోవచ్చును.

బ్రూ కొరకు అడగండి— కాఫీ చికరీ ఎలా రుచించాలో తెలిసిన బ్రూక్ బాండ్ నిపుణులచే, జాగ్రత్తగా కలుప బడినది.

ఇది క్షణంలో అయేది!
సమయం మిగిలిస్తుంది!
డబ్బు ఆదా చేస్తుంది!




Bensons/338B/2 TELR



# న్యాయం?




ఝరున మొదలైంది వర్షం.

జగ్గు పరిగెట్టుకుంటు వెళ్ళి ఓచెట్టుని ఆశ్రయించాడు.

చూస్తుండగానే హోరున కురువసాగింది వర్షం ... దానికితోడు గాలి. అతను నిల బడింది చిన్నచెట్టుకిందేమో క్షణాలమీద పూర్తిగా తడిసిపోయాడు.

ఉరుములు, మెరుపులు ... ఎక్కడో దూరంగా పిడుగులూ.

నీళ్ళు జలజల పారుతున్న శబ్దం... 'అప్పుడే వరదలు కట్టింది—ఇప్పుడప్పుడే వెలిసేట్టులేదు. కనీసం అరగంటైనా ఊపి వదులుతుంది. నాలుగురోజులు కట్టు దిట్టంగా వేసుకుని బయలుదేరిన ప్లాను చెడుతుందేమో ... వెధవ వర్షం...ఇప్పుడే బయలుదేరాలా...లోక కళ్యాణార్థం...కావా లన్నప్పుడు ఆమడదూరంలో కనిపించదు. అవసరం లేనప్పుడు తగుదునమ్మా— అంటూ వళ్ళో వాలుతుంది...ఛీ ..ఛీ...'

ఏదో లారీ నీళ్ళని చిమ్ముకుంటూ, వింతైన సంగీతం వినిపిస్తూ శరవేగంగా ఉత్తర దిశకి దూసుకెళ్ళింది. దాని హెడ్ లైట్ల కాంతిలో వర్షం బిందువులు రోడ్డుమీదపడి విరిగిపోతున్న ముత్యాల్లా కనిపించాయి. తారురోడ్డు మెలికలు తిరిగిన నల్లత్రాచులా కనిపించింది.

మళ్ళీ చీకటి. దూరంగా చౌరస్తా (నాలుగురోడ్ల కూడలి) లో వెలుగుతున్న మెర్క్యురీ లైటు కాంతి మసగ్గా జగ్గు నిలబడ్డ చెట్టుమీద పడుతుంది. నీటిలో తడుస్తూ కేరింతలతో తలలూపుతున్న ఆకులు తళుక్కున మెరుస్తున్నాయి.

జగ్గుకి విసుగు వేసింది. ఇలా ఎంత సేపని...పాడు వర్షానికి భయపడితే పనులు జరిగినట్టే...ఇప్పటికే వంటిగంట దాటింది. ఇంకా చేతులు వేలాడేసుకు నిలబడిపోతే కోడికూత విని వెనక్కి వెళ్ళిపోవచ్చు...ఈ చెట్టుకిందమటుకు తడవకుండా ఉండ గలుగుతున్నాడేమిటి... అంతా నీటిమయం తల నిండుగా తడిసి నీటిచుక్కలు ముందుకు వాలిన వెంట్రుకలగుండ ముక్కుమీదికి జారుతున్నాయి...గుడ్డలు వంటికి అతుక్కు పోయాయి—

కడకడలాడుతూ ఎక్కడో పిడుగు — దాంతోపాటు మెరుపు.

జగ్గు కళ్ళు మిరిమిట్లు గొలిపాయి.

'అమ్మా...' అనుకుంటూ కళ్ళు మలుపుకున్నాడు.

మెల్లిగా కళ్ళుతెరిచి చూశాడు. ఈసారి మసక వెలుతురుకూడా కనిపించలేదు. కొన్ని క్షణాలనంతరం మెల్లిమెల్లిగా తెరలు దించుకున్నట్టు వెలుతురు బయట పడింది.

వర్షం కొద్దికొద్దిగా తిరుగుముఖం

పడుతున్నట్టుంది...మళ్ళీ జగ్గులో ఆకలి
చిగిర్చాయి.
రోడ్డుకీ, ఆటను నిలబడ్డ చెట్టుకీ
మధ్య కాలువలుకట్టి (నీళ్ళు) వేగంగా
పారుతున్నాయి.
జాగ్రత్తగా దాన్నిదాటి రోడ్డెక్కాడు.
వర్షం పూర్తిగా తగ్గి మసూధువట్టి
చిన్నగా కురవసాగింది.
తలపైకెత్తి ఎందుకో ఆకాశంవంక
చూడబోయాడు — సాధ్యపడలేదు. వాన
చినుకులు కళ్ళల్లోకి సూదుల్లా వచ్చాయి.
గబగబా నడుస్తూ హోటల్ దగ్గరికి
వచ్చాడు.
మెర్క్యురీ లైటు పరిసరప్రాంతాన్ని
నీలరంగులో ముంచెత్తుతూ, గర్వంగా బిగేల్
మని విరగబడి నవ్వుతుంది.
రోడ్డుకి పక్కగా ఇప్పుడో అప్పుడో
కూలిపోయేలాంటి గుడిసె ఉంది.
అది హోటలు.
రిక్షావాళ్ళు, జట్కావాళ్ళు, మూడో
రకం కేడీగాళ్ళు అక్కడికి చేరి సేద తీర్చు
కుంటూంటారు.
అక్కడ టీ—ఖారాబూందీ (కారబూందీ)
తప్ప మరో వస్తువు దొరకదు.
ఆ 'టీ' అమృతప్రాయం— ఆ బూందీ
పంచభక్ష్య పరమాన్నం — ఈ రెండూ
అందిచేవాడు ఆర్తత్రాణ పరాయణుడు...
దీనికంతటికీ కారణం ఉంది. నాటికి
తొంభయ్యేంతులు అరువుసేరాలే.
జగ్గుకి కొన్ని నవ్వు వేడివేసుకోవాలని
పించిందేమో — అందులోకి చూశాడు.
లోపల మసివట్టిన లాంతరు టిక్కు
టిక్కుమంటు — శాశ్వతంగా కన్నుమూయ
బోయే క్షయరోగిలా ఉంది.
ఆ లాంతరుకి సహాయార్థం — అక్క
డక్కడా తడిక సందుల్లోంచి లోపలికి
ప్రసారమవుతుంది వీధిదీపం వెలుగు.
ఇద్దరు మనుషులు బీడీదమ్ములాగుతూ
చింకిపోయిన ఈతచాపమీద చాలీచాలని
దుప్పట్లని పైపైకి లాక్కుంటూ,
రోజాభి రామాయణం చేసుకుంటున్నారు.
అంతకుముందువరకూ గుర్రుపెట్టి నిద
పోయి ఉంటారు. వర్షంతాకిడికి తట్టుకో
లేక నాలుగుబొంతులు గాల్లోకి విసిరి లేచి
కూర్చున్నట్టున్నారు.
లోపలికి ప్రవేశించిన జగ్గు ఓసారి
వాళ్ళవైపు చూశాడు. మళ్ళీ దృష్టి
తిప్పేసుకుని అక్కడే సగం తడిసిఉన్న
కుర్చీలో కూలబడ్డాడు.
వాళ్ళిద్దరుకూడా తలలు తిప్పి కొత్త
శాల్తీని కొన్నిక్షణాలు పరీక్షగా పరికించి
మళ్ళీ రోజాభిరామాయణంలో మునిగి
పోయారు.
జగ్గు చుట్టూ చూశాడు. వాళ్ళిద్దరు
తప్పించి మరెవ్వరూ కనిపించలేదు.
'తన పిచ్చి కాకపోతే ఇప్పుడు 'టీ' ఎవడు
చేసి తనకందిస్తాడు ... అనవసరంగా
టైమ్ దండగ చేసుకుంటున్నాడు తను...
ఈ పాటికి...
బయట టపటప శబ్దం మొదలైంది.
మళ్ళీ వర్షం...
సాతాజడ్డి చొక్కాజేబులో చెయ్యి
పెట్టాడు. బీడీకొరకు రెండువేళ్ళమధ్యన ఇరి
కిన బీడీని పైకిలాగి చూశాడు. అది బీడీ
లాగే ఉంది. కాని, నోట్లో పెట్టుకునే
వైపునుంచి నీటిచుక్కలు పడుతున్నాయి.
మరోసారి వర్షంమీద విసుక్కున్నాడు
జగ్గు.
బీడీని లాంతరు పైభాగాన పెట్టాడు.
'నే నొప్పుకోను...' వాళ్ళిద్దరిలో ఒక
డంటున్నాడు.
అనక్తిగా వాళ్ళవైపు చూపుసారించాడు
జగ్గు.
'నువ్వేకాదు...నీ బాబు ఒప్పుకుంటాడు.
ఈ లోకంలో న్యాయానికి జాగాలేదు...'
మరొకడు ఖచ్చితంగా అంటున్నాడు.
'పోరా...నీ పొల్ఫు మాటెవడింటాడు...
ఈన్యాయమే లేకపోతే మనకి బువ్వెలా దొరుకు
తొంది...?'
వాడి ప్రశ్న జగ్గుకి నచ్చింది. దానికి
మరొకడి సమాధానం ఎలా ఉంటుందోనని
ఎదురుచూశాడు.
'చవ్...నీకేంతెల్సు...న్యాయంగా నడిస్తే
మనకెంత అందుతుందేంటి బువ్వ...పిడి
కెడు...అదే అన్యాయంగా నడిస్తే...'
'తన్ని జెయిల్లోకి తోస్తారు. యాడకీ
కదలకుండా కట్టిపడేస్తారు. ఆ తర్వాత
నీ పెళ్ళాం బిడ్డల కెవడెడతాడు బువ్వ...?
ఎవడన్నా యింటే నవ్వుతాడుగాని — అన్నె
యం గురించి దమాక్ ఖరాబు చేసుకోకు.
న్యాయంగురించి మాట్లాడు...' రెండో
వాడు మరి మాట్లాడలేదు.
కాలువలో రెండుగంటలు కొట్టారు.
ఉలిక్కి పడ్డాడు జగ్గు.
చరుక్కున లేచి గబగబ గుడిసె దాటి
బయటికొచ్చాడు.
విప్పేమున్నాయి పవాలు. వర్షం తన
ఉధృతాన్ని మరీ జోరుగా, భయంకరంగా
చూపిస్తుంది.
లాంతరుమీద వదిలిపెట్టిన బీడీ గురించి
ఆలోచించలేదు. అది లాగకుండా బయలు
దేరుతున్నాననే — అని బాధపడలేదు.
కర్తవ్యం వెన్ను తట్టుతుంది.
ఒక బంగళాముందు ఆగాడు జగ్గు.
సీరకంటితో పరిసర ప్రాంతాల్ని పరీ
క్షించి గబుక్కున ప్రహారీగోడ ఎక్కి
లోపలికి దూకాడు.
పూలమొక్కల్ని తొక్కుకుంటూ మెల్లి
మెల్లిగా సింహద్వారాన్ని చేరాడు. తలుపుకి
తాళం వేసి ఉంది.
ప్యాంటుజేబులోంచి తాళం చెవుల గుత్తి
తీసి అయిదు నిమిషాలు శ్రమపడి తాళం
విప్పగలిగాడు.
'కౌన్హై...!!!' చౌకీదారు కంఠం
అంత వర్షంలోనూ స్పష్టంగా వినిపిం
చింది
గబుక్కున తాళం యథావిధిగా బిగించి
పక్కకి తప్పుకున్నాడు.
'కౌన్హై రేవో...?' అంటూ పులిలా
మెట్లెక్కి సింహద్వారం సమీపించి తాళం
కప్పని పరీక్షించి చుట్టూ కలియజూశాడు
చౌకీదారు.
స్తంభంచాటున పిల్లిలా నక్కి ఊపిరి
బిగబట్టాడు జగ్గు.
నిమిషం... రెండు నిమిషాలు.....అయిదు
నిమిషాలు...పదినిమిషాలు భారంగా దొర్లాయి.
చౌకీదారు అక్కడ్నుంచి కదల్లేదు.
పైనున్న గొట్టంలోంచి నీళ్ళు ధార
కట్టి జగ్గు భుజంపైన పడుతున్నాయి.
ఇటూ, అటూ జరగడానికి వీల్లేదు.
చీకట్లో చౌకీదారు ఆకారం కదిలింది.
కళ్ళు చించుకుని చూశాడు జగ్గు.
మెల్లిగా కదిలి అవుట్హౌస్వైపు సాగి
పోయాడు చౌకీదారు.
ఇక తాళం తీసే ప్రయత్న[illegible]
అనవసరం...
స్తంభం చాటునుం[illegible]గా
కదిలి బంగళాకి మరోవైపుకి చేరాడు

గోడని తడుముతున్న చేతులకి సిటీగొట్టం తగిలింది.

నెమ్మదిగా దాన్ని పెక్కడం ప్రారంభించాడు.

కాళ్ళు, చేతులు జారుతున్నాయి.

వర్షం ముక్కలు తలమీద టపటప పడుతున్నాయి.

శక్తినంతా కూడగట్టుకుని రెండో అంతస్తు కిటికీ దగ్గరికి చేరాడు. కిటికీ రెండుతలుపులకీ అద్దాలు బిగించి ఉన్నాయి. ఈ సమయంలో అద్దాలు విరగ్గొడితే చౌకీదారు విని, పరుగెట్టుకు రావచ్చు.

జగ్గుకి మెరుపులాంటి ఆలోచనతట్టింది.

కుడిచేతి పిడికిలి బిగబట్టి తయ్యారుగా ఉన్నాడు.

ఆకాశం గడగడమంటూ ఉరిమింది.

పెడీ—మని అద్దాన్ని కొట్టాడు. పెళపెళమంటూ అద్దం ముక్కలు లోపలి భాగాన పడ్డాయి.

ఆకాశం ఉరిమిన శబ్దంలో ఆ శబ్దం కలిసిపోయింది.

విరిగిన భాగంలోంచి చేతిని పోనిచ్చి గెడతీసి తలుపులు తెరుచుకుని లోపలికి దూకాడు జగ్గు.

చుట్టూ పరీక్షగాచూసి, తృప్తిగా గాలి పీల్చుకున్నాడు.

ఆలస్యం చెయ్యకుండా ముందడుగు వేశాడు.

పది నిమిషాల్లో ఇనప్పెట్టె ఉన్నగది కనుక్కోగలిగాడు.

గది తలుపులు చేరవేసి ఇనప్పెట్టెని సమీపించాడు.

అతనిలో ఆనందం అవధులు దాటి పొంగింది. మోకాళ్ళమీద కూర్చుని ఇనప్పెట్టె తెరిచే ప్రయత్నంలో మునిగిపోయాడు పది హేను నిమిషాలు దొర్లిపోయాయి.

గదిలో నెప్పగాఉంది.

క్లిక్‌మని తెరుచుకుంది ఇనప్పెట్టె తాళం…తలుపు బలంగాలాగి తెరిచాడు.

కళ్ళు మిరుమిట్లుగొలుపు వెలుగు జిగేలుమన్నాయి.

నోట్ల దొంతరలు…ఇనప్పెట్టె నిండా డబ్బు…డబ్బుతో నిండి ఉంది ఇనప్పెట్టె.

హఠాత్తుగా ఆగిపోయాడు జగ్గు. చెవులు రిక్కించివిన్నాడు. సందేహం లేదు—ఇంజను శబ్దం లీలగా విని పించుతూంది.

ఎవరిదో కారు బంగళాలోకి ప్రవేశించింది.

ఇప్పుడేమిటి చెయ్యడం…?

క్రిందభాగాన దడేల్న తలుపులు తీసిన శబ్దం… దాంతో బాటు మళ్ళీ తలుపులు విసురుగా మూసివేసిన శబ్దం…

ఎవరో దడదడ మెట్లెక్కుతున్నారు—ఎంతమంది ఉన్నారో…?!

జగ్గు కదల్లేదు…అసలు కదల తల్చుకో లేదు. వెనకజేబులోంచి ఆరంగుళాల కత్తి తీసి పట్టుకున్నాడు.

అడుగుల సవ్వడి ప్రక్కగదిలోకివచ్చి ఆగిపోయింది.

'ఒరేయ్ గంగా! దాన్ని అలా మంచం మీద పడెయ్యి…' ఎవరిదో కంఠం కర్కశంగా వినిపించింది.

కొన్ని క్షణాలు గడిచాయి.

'దొరా! నన్ను పొమ్మంటరా…?'

గబగబ వెళ్ళి తలుపు సందులోంచి చూశాడు జగ్గు. అక్కడి దృశ్యం చూసి నిర్ఘాంతపోయాడు.

'అవును మరచేపోయాను…' అంటూ రెయిన్‌కోటు హేంగర్‌కి తగిలించి పర్సు తీసి అందులోంచి అయిదువందల రూపాయల నోట్లు రౌడీలాంటి ఎదుటి మనిషికిస్తూ 'ఇక నువ్వు వెళ్ళు…జాగర్త … విషయం పొక్కకూడదు…' అన్నాడు నలభైయ్యేళ్ళు దాటిన ఒకవ్యక్తి.

రౌడీలాంటి మనిషి సంతోషంగా దణ్ణాలు పెడుతూ వెళ్ళిపోయాడు.

జగ్గు దృష్టి మంచంపైన పడింది.

పదహారేళ్ళు నిండిన పడుచు కట్టిన కట్లని విడిపించుకోడానికి పెనుగులాడు తూంది. అరవకుండా ఆమెనోటికి నల్లని గుడ్డ కట్టబడి ఉంది.

జగ్గు వళ్ళు జలదరించింది.

అతను 'సెంట్' లూజ్ చేసుకుంటూ వంకరగా నవ్వాడు ఆమె అవస్థచూసి.

'ఏం…బాధగాఉందా…?అకట్లు విప్పేస్తాను. ఇక్కడ నువ్వు అరిచి గీపెట్టినా రక్షించేవాళ్ళు లేరు…' అంటూ—ఆమె కట్లు ఊడదీశాడు.

ఆమె దిగ్గున లేచి కూర్చుంది.

అతను పక పక నవ్వాడు…నవ్వుతూ—'నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా…?' అన్నాడు.

ఆమెకి వళ్ళు మండినట్టుంది—'థూ…' అంటూ ఉమ్మి వేసింది.

'ఎందుకలా మిడిసిపడతావు…నీ కొరకు ఎంత శ్రమపడ్డానో, ఎంతడబ్బు ఖర్చు పెట్టానో నీ ఊహ కందని విషయం … ఇంతా చేస్తే ఇదా నువ్వు చేసేది. మారు మాట్లాడకుండా నాకు లొంగిపో… నీకు ఎంతకావాలో అంత ఇచ్చుకుంటాను.'

'ఛీ…సిగ్గులేదూ. ఆనాడు తిన్న చెప్పు దెబ్బ మరిచిపోయావా…?'

ఆమె ఇంకా ఏదో అనబోయింది—చటు

## న్యాయం



# వరలక్ష్మీ వ్రతం

వినాయకవ్రతం, సత్యవ్రతి వ్రతం మొదలైన వ్రతాలు స్త్రీలు, పురుషులు చిన్నలు పెద్దలు అందరూ చెయ్యవలసినవి. వరలక్ష్మీవ్రతాన్ని మాత్రం సాధారణంగా స్త్రీలు—చిన్నా, పెద్ద భేదం లేకుండా సుమంగళులైన స్త్రీలందరూ ఆచరిస్తారు. ఇది శ్రావణమాసంలో పున్నమకు ముందుగా వచ్చే శుక్రవారంనాడు జరుపబడుతుంది. ఏ ఆటంకాలవల్లనైనా ఆనాడు సాధ్యం కాకపోతే—ఆ మాసంలో అనుకూలమైన ఏ శుక్రవారం రోజున అయినా ఈ వ్రతం జరపవచ్చు.

ఆనాడు ఉదయాన్నే స్త్రీలు తలంటుకొని స్నానంచేసి పట్టువస్త్రాలు ధరిస్తారు. దేవుని పూజచేసేగదిలో ఒక మండపం కట్టి దానిని బాగా అలంకరిస్తారు. మండపం మధ్యను ఒక పీటాన్ని ఉంచి దానిపై కలశాన్ని స్థాపిస్తారు. దానిపైని ఒక నారికేళఫలాన్ని ఉంచి, దానికి ఒక కొత్త గుడ్డచుట్టి లక్ష్మిని ఆవాహన చేసి షోడశోపచారాలతోనూ పూజ చేస్తారు. ఆభరణ పూజకూడా ముఖ్యమే. కొత్త కోడళ్లను ఈ వ్రతానికి తప్పకుండా రప్పించి కొత్త ఆభరణాలకు పూజ చేయించడం సంప్రదాయం. నగలు చేయించకపోతే, బంగరు కాసుకొనైనా పూజ చేయించి, దానిని ఆ కోడలికిస్తారు. విలువైన చీరలూ అవీ కూడా ఇవ్వడం కద్దు. పూజ అయిన తర్వాత తోరాలను—రక్తవర్ణమైన పసుపు పూసిన దారాలను పూజించి.

'బధ్నామి దక్షిణే హస్తే
నవసూత్రం శుభప్రదం
పుత్రపౌత్రాభివృద్ధించ
సౌభాగ్యం దేహి మే రమే'

అనే శ్లోకం చెప్తూ కుడిచేతికి కట్టుకుంటారు. తర్వాత, నైవేద్యం పెట్టిన వివిధభక్ష్యాలతో సహా భోజనంచేసి, ఆనందంగా ఆ రోజు గడుపుతారు. సాయంకాలం పేరంటాళ్ళకి, ముత్తయిదువులకు ఫలపుష్పాలతో తాంబూలములను ఇస్తారు. ఇలా చేస్తే సంతానానికిగాని సిరిసంపదలకు గాని యెట్టి లోటూ వుండదని విశ్వాసం.

వరలక్ష్మీ వ్రతానికి సంబంధించిన కథలు రెండున్నవి. ఒకటి స్త్రీలకు సంబంధించినదీ, మరొకటి పురుషులకు సంబంధించినదిన్నీ.

ఒకప్పుడు పరమేశ్వరుడు కైలాసంలోని సభలో ప్రమథగణాలతోనూ, మునులతోనూ కొలువుతీర్చివుండగా — పార్వతి దేవి — భూలోకంలోని జనులు సిరిసంపదలతోనూ, పుత్రపౌత్రులతోనూ వుండేటట్లు చేసే వ్రతమేదైనావుంటే చెప్పవలెనని ప్రార్థించింది. పరమేశ్వరుడు—వరలక్ష్మీ వ్రతమనే వ్రతం ఉన్నదనీ, అది పుత్రాభివృద్ధినీ, సంపత్సమృద్ధినీ కలిగిస్తుందనీ చెప్తూ, ఆ వ్రతం ఆచరించే విధానాన్ని తెలియజేశాడు. ఈ వ్రతం చేసి, సిరిసంపదలతో తులతూగిన చారుమతి వృత్తాంతాన్ని యిలా తెలిపాడు—

కుండిన నగరంలో పూర్వం ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన భార్య పేరు చారుమతి. ఉత్తమ గుణములు గల ఇల్లాలు పతివ్రత ఎక్కువ దైవభక్తి గలది. వారిది సామాన్య సంసారం. ఉన్నదానితో తృప్తిపడుతూ గౌరవంగా కాలం గడిపేది. ఒకనాడు రాత్రి — ఆమె భక్తికి మెచ్చిన లక్ష్మీదేవి కలలో కనబడి వరలక్ష్మీవ్రతం చెయ్యవలెననీ. అలా చెయ్యడం వల్ల పుత్రపౌత్రాభివృద్ధీ, సిరిసంపదలూ కలుగుతాయనీ చెప్పి, ఆ వ్రతంచేసే విధానాన్ని తెలిపింది. చారుమతి ఉదయాన్నే తన స్వప్న వృత్తాంతాన్ని అందరికి చెప్పింది. వారు చాలా సంతో



పించి, ఆ వ్రతం చెయ్యవలెనని అన్నారు. ఆమె వ్రతంచేసి, సమస్త సంపదలతో తులతూగింది. పట్టణంలోని స్త్రీలచేత ఈ వ్రతం చేయించి, వారి అభివృద్ధికి తోడ్పడింది— ని. అప్పటినుంచి దీన్ని స్త్రీలందరూ ఆచరిస్తున్నారు

మరొక కథ భవిష్యోత్తర పురాణంలోనిది ఒకనాడు కైలాసంలో పార్వతీ పరమేశ్వరులు పాచికలాడుతున్నారు ఆటలో వివాదం వచ్చింది శివుడు ఓడిపోయాడని పార్వతీ, పార్వతి ఓడిపోయిందని శివుడూ వాదించుకొని, ఆ దగ్గరలో వుండి ఆట చూస్తూ వున్న చిత్రనేమి అనేవాడిని మధ్యవర్తిగా వుండి తీర్పుచెప్పాలని కోరారు [illegible]. శివునికి భయపడి ఆ మధ్యవర్తి 'పార్వతీదేవి ఓడిపోయిం'దని అన్నాడు పార్వతీదేవికి కోపంవచ్చి, చిత్రనేమి కుష్ఠురోగి అయ్యేటట్లు శపించింది. తర్వాత శంకరుడు ఆమెను ఊరడించగా—పార్వతి శాంతించి, కొన్నాళ్లకు ఒక సరోవర తీరంలో అప్సరసలు ఒక వ్రతం చేస్తారనీ, అక్కడున్న చిత్రనేమికి ఆ వ్రతాన్నిగూర్చి తెలుపుతారనీ, అప్పుడు రోగం నశిస్తుందనీ శాపాంతాన్ని అనుగ్రహించింది.

కుష్ఠుపీడితుడైన చిత్రనేమి ఆమె చెప్పిన సరోవరానికిపోయి కొంతకాలం [illegible] అప్సరసలువచ్చి, అక్కడ వరలక్ష్మీవ్రతం చేశారు చిత్రనేమి అడుగగా, వారు 'ఇది వరలక్ష్మీ వ్రతం' అని చెప్పారు. ఆ వ్రతాన్ని చూస్తూ వుండగానే అతనిరోగం కొన్ని నిమిషాల్లో నశించి దేహానికి స్వర్ణచ్ఛాయ కలిగింది. ఎంతో ఆరోగ్యవంతుడైనాడు. తర్వాత అతడున్నూ ఆ వ్రతంచేసి, తిరిగి కైలాసానికి పోయి, పార్వతీ పరమేశ్వరులకు సాష్టాంగపడి, ఆ ఆది దంపతుల దీవనలు పొందాడు.

దీనినిబట్టి చూడగా, ఈ వ్రతాన్ని పురుషులుకూడా చెయ్యవచ్చునని తెలుస్తున్నది. నందుడూ, విక్రమాదిత్యుడూ వరలక్ష్మీ వ్రతాన్ని ఆచరించి రాజ్యలాభాన్ని పొందారట!

—బు. వేం. ర.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1969 దీపావళి కథల పోటీ

ఎప్పటివలెనే ఈ సంవత్సరం కూడా 'ఆంధ్రసచిత్ర వారపత్రిక దీపావళి కథల పోటీ' నిర్వహించబోతున్నదని తెలపటానికి సంతోషిస్తున్నాము రచయితలందరూ ఎప్పటి వలెనే మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము

## మొదటి బహుమతి రు. 2300

## రెండవ బహుమతి రు. 1600

## మూడవ బహుమతి రు. 550

### నిబంధనలు

1. కథలు ఇంతకిముందు అచ్చుఅవని స్వంత రచనలై ఉండాలి. ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంత రచనేనని, దేనికీ అనువాదంకానీ, అనుసరణకానీ కాదని హామీ రాసి పంపాలి ఈ హామీలు వేరేకాగితం మీద కాకుండా కథ వ్రాతప్రతి మీదనే రాసి ఉండాలి

2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3. వ్రాతప్రతి మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒకవైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయితపేరు, పూర్తి చిరునామా కూడా వ్రాతప్రతి మీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సయిజు నోట్‌బుక్ పేజీకి రెండు రెట్లు) పేజీలకు మించరాదు

4. కవరుమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు—1'కి పంపాలి.

5. పోటీ గడువు తేదీ 30—8—69 ఆ తర్వాత మా కార్యాలయానికి చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచికగా' వెలువడే 7—11—69 తేదీ కల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.

7. పోటీ తుది నిర్ణయం ఆంధ్రసచిత్ర వారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపడానికి వీలులేదు

8 వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపడానికి సాధ్యం కాదు పోటీలో పాల్గొనేవారు తమ రచనలతో తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవర్లు పంపనవసరం లేదు.

9. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించే ముందు తెలుపుతాము



సీరియల్

శిఖా వెంకటరమణ

### జరిగిన కథ

రాజశేఖరం, గిరిధర్ ఇద్దరూ చిన్నప్పటి నుంచి సన్నిహితంగా వుండేవారు. వారి కుటుంబాలు కూడా చాలా అన్యోన్యంగా వుండేవి. అకస్మాత్తుగా రాజశేఖరం వూరు విడిచి కోనసీమకి వెళ్లవలసి వస్తుంది. రాజశేఖరం కూతురు జయ. గిరిధర్ కొడుకు సాంబశివం (సాంబు) సాంబశివాన్ని విడిచిపెట్టి వెళ్లడమంటే జయకి దుఃఖం ముంచుకొస్తుంది. తప్పనిసరిగా విడిపోవలసి వస్తుంది. జయ మేనమామ కొడుకు కాళిదాసు. చదువుల కోసం మద్రాసుకి వస్తారు అక్కడ జయకి సాంబు కనిపిస్తాడు. సాంబు జయని గుర్తుపడతాడుగాని, జయ సాంబుని ఎరగనంటుంది. సాంబు కాళిదాసుతో తన కథ చెబుతాడు. రాజశేఖరం జయని పెళ్లి చేసుకోమని కాళిదాసుని అడుగుతాడు. భారతికి అన్యాయం చెయ్యడం అతనికి ఇష్టంలేదు.

## 4

జ తండ్రి గదిలోకి వచ్చి అతని కుర్చీకి ఎదురుగా కూర్చుంది జయ. చిన్నతనంలో ఆయన భుజాలమీద చేతులువేసి క్షణం కూడా వదలని జయ పెద్దది కాగానే దూర దూరంగానే వుండిపోయింది. ఇవాళ తన గదిలోకి ప్రత్యేకం పనిపెట్టుకు వచ్చిన కూతుర్ని అతను పరీక్షగా చూశేడు. చూసి వూరుకోలేకపోయాడు: 'చూడు తల్లీ నీకేం కావల్సినా నిర్భయంగా అడుగు,' అన్నాడు.

జయ నవ్వి: 'నాకు యేం కావల్సి వస్తుంది నాన్నా. అన్నీ యిచ్చేరు మీరు. చదువు చెప్పిస్తున్నారు,' అన్నది.

రాజశేఖరం అంతటితో వూరుకోలేదు: 'నువ్వేదో కారణం వుంటేగానీ రావు జయా. చెప్పు నీకేం కావాలో,' అన్నాడు.

జయ సర్దుకుని కూర్చుంది. తల్లీ, మేనత్తా వంటింట్లో వున్నారు తండ్రితో యేకాంతంగా మాట్లాడేందుకు మంచి అవకాశం యిప్పుడే! చూపుడు వేలితో టేబిల్‌మీద గీతలు గీస్తూండిపోయింది కొంచెంసేపు. చివరకు గొంతు పెగిలించుకుని అతన్ని చూస్తూ: 'వివాహం అంత ముఖ్యమా నాన్నగారూ?' అని ప్రశ్న వేసింది.

రాజశేఖరం తలెత్తి నిరుత్తరుడై పోయేడు. కూతురి సమస్య అతనికోపట్టాన అంతు చిక్కలేదు.

'చెప్పండి నాన్నగారూ! ఒకవేళ అదే ముఖ్యం అయితే వర్ణాంతర, శాఖాంతర వివాహాలమీద మీ అభిప్రాయం తెలుసుకోవాలని వుంది. నేను మిమ్మల్ని యిన్ని అడుగుతున్నాను. ఇదంతా మీరిచ్చిన చనువు వల్ల. నేనేమీ తప్పుగా మాట్లాడటం లేదు కద!'

రాజశేఖరం నిట్టూర్చేడు: 'తగిన కారణం వుంటేగానీ నువ్వీ విషయాన్ని తీసుకురావు. వర్ణాంతరం, శాఖాంతరం అంటూ గడిపే రోజులు సగం మాతోటే పోయేయి వివాహం సాంఘిక వ్యవస్థ. పెళ్లీ పెడాకులూలేని మనిషికి యివ్వాల్సిన గౌరవం సంఘం యెప్పుడూ యివ్వదు. యేదో ఒకరోజున మగవాళ్లూ ఆడవాళ్లూ తల వొంచుకోక తప్పదు. యింతకీ...'

'అయితే నాన్నగారూ! ధనవంతులు పేదవాళ్ళని చేరదీసి వాళ్ళకి ఆశ్రయం కల్పించే అవకాశాలున్నాయా.'

'యెందుకు లేవు. మనం యిచ్చే డబ్బుని దుర్వినియోగం చేయనంతవరకూ యెంతైనా సహాయం చేయవచ్చును శక్తి మేరకు. అది సరే...నువ్వు అడిగేదేదో సూటిగా అడిగితే బాగుంటుంది. నిన్ను నేనేమీ అనేవాడిని కూడా కాదు'

జయ ఆలోచించి అన్నది: 'నా విషయం కాదు నాన్నగారూ! భారతి అని మా క్లాస్‌మేట్‌కి బావ మీరు పంపే డబ్బులో ఆర్థికంగా సహాయంచేస్తూ ఆ పిల్లని పెళ్లి చేసుకుంటానని మాట యిచ్చేడు'

రాజశేఖరం ఆశ్చర్యంగా చూశాడు: సామాన్యంగా మగపిల్లలలోవుండే తెగింపూ, ధైర్యమూ కాళిదాసులో అతనెప్పుడూ చూడలేదు. తన అవసరాల్ని కూడా సమాధి చేసుకునే ఆ పిల్లడిపట్ల రాజశేఖరానికి ప్రత్యేకమైన గౌరవం వుంది.

'నువ్వనేది నిజమేనా జయా!' అన్నాడు ఆయన వెనుప్లిగా.

'[illegible] భారతికి [illegible] యిచ్చేడు. అత్త అతని ప్రాణాలు తోడే స్తోంది. ఆ పిల్లకి స్కాలర్‌షిప్‌లు తప్ప మరే ఆధారం లేవు. మీరు జోక్యం చేసుకోక పోతే...'

రాజశేఖరం వింటున్నాడు.

'కాలేజీలో అందరికీ తెలుసును ఈ విషయం. బావ అంటే వున్న గౌరవంవల్ల యెవరూ యేదీ అనలేక పోతున్నారు. రేపు అతను యీ బలవంతాలవల్ల పెళ్లి చేసు కోవడం మానేస్తే ఆ పిల్ల ప్రాణం తీసుకుంటుంది. అందువల్ల వచ్చే నష్టంలో మనంకూడా భాగం పంచుకోవాలి', జయ అంత మాట్లాడుతున్నదే కానీ మనసులో [illegible] అగ్ని పర్వతాలని బద్దలు [illegible]కుండా దాచుకునే ప్రయత్నం చేస్తోంది.

రాజశేఖరం బుర్ర రకరకాలుగా ఆలో చిస్తోంది. తన కూతురు జయకి తానేమీ చేయలేని స్థితిలో వుండి పోయినట్లు బాధపడుతున్నాడు. రాజశేఖరం గత పదిహే నేళ్లలోగా ఆలోచిస్తూ యెక్కడో హృదయ కుహరంలో దాచుకున్న లీలా మాత్రపు విగ్రహానికి ఈక్షణంలో తప్పని సరిగా చోటిచ్చి ప్రాముఖ్యతని యిచ్చేడు. అతనికళ్లముందు రకరకాలుగా స్మృతులు కదులుతున్నాయి. అందులో నీలం యూనీ ఫామ్‌లో చెట్టాపట్టాలు వేసుకుని అడు గులో అడుగు వేసుకుంటూ నడిచి వస్తున్న అనురాగపు జంటా నేడు చాలా పెద్దగా మారిపోయి చీలిపోవడం వరకే అతని మేధ అందుకుంటోంది. ఆ స్థానంలో కనుమరుగైపోయిన సాంబశివం మాత్రమే వున్నాడు. యేళ్లు పైన బడుతూంటే రాజశేఖరానికి మానసిక దుర్బలత యేర్పడు తోంది. తన అనంతరం కాళిదాసు చేతిలో ఆ పిల్లనుంచి శాంతిగా కళ్లు మూయా లనుకున్నాడు. కానీ...ఆ కాళిదాసే అతనికి అందకుండా పోయేడు. ఆస్తిపాస్తుల గొడవలవల్ల అతను చిన్నతనంలోనే ఒక దానిపైన ఒకటి ఆధారపడి అల్లుకు పోయిన అనురాగపు లతని పరిస్థితుల ప్రాబల్యంగా విడదీసి యిప్పుడు విచారిస్తు న్నాడు. పైకి అతను కూతురు ముందు యేమాత్రమూ యీ విషయాన్ని బయట పెట్టలేదు. జయ తలమీద చేయివేసి 'అలాగే తల్లీ నేను కనుక్కుంటాను', అనేసి [illegible] వెళ్లి బయలుదేరాడు.

* * *

జయ మనసు అల్లకల్లోలం అయి పోయింది. మేనత్తా, తల్లీ, తండ్రీ [illegible]

[illegible] చిన్నారాడు తను పెంచుకున్న మమతల వలయాలు యిప్పుడు పెరిగి పెద్దవై తనని బంధించి వేస్తున్నాయి. సాంబశివం లేనిదే తను క్షణం వుండలేదు కానీ యీ విష



# పరిలిప్తం

యాన్ని అయుటపెట్టడం యెంత తెలివి తక్కువతనమో ఆలోచిస్తున్న కొలదీ మెదడు వేడెక్కిపోతున్నది. సాంబశివాన్ని చేసుకుంటానంటే కాదనేవారే లేరు కానీ సాంఘిక కట్టుబాట్లతో పెరిగి, నియమ నిష్ఠలని వుపేక్ష చేయని అతని తల్లి తండ్రులు ఈ వివాహానికి సుముఖంగా వుంటారో లేదో అనే జయ బాధ. యేక కులమ్మలే అయినా తన తండ్రి ఒకప్పుడు వారాలు చేసుకుని బ్రతికాడనే నిరసన ఆ చిన్నతనంలోనే జానకి కళ్లల్లోనూ, గిరిధర్ మాటల్లోనూ కొంతలో కొంత యిప్పుడు అధ్యయనం చేసుకుని అర్థం చేసుకోగలిగింది.

'జయా!' అంటూ లోపలికి వచ్చేడు కాళిదాసు. జయ కళ్లు తుడుచుకుని యిటు తిరిగి అతనివైపు చూస్తూ 'యేం బావా, యిలా వచ్చేవు?' అన్నది.

కాళిదాసు స్టూలుమీద కూర్చున్నాడు. అతనిమనసు జయపట్ల కృతజ్ఞతతో నిండి పోయింది. జయికి దగ్గరగావెళ్లి రెండు చేతులూ అందుకుని: 'నీ మేలు యే జన్మ లోనూ మరిచిపోలేను. నువ్వుపెట్టిన భిక్ష యిది. మావయ్యకి చెప్పే ధైర్యం లేక అమ్మని ఒప్పించగల్గే సాహసంలేక, వాళ్లుచేసే బలవంతానికి, మీరు చూపించిన ఆదరణకి కృతఘ్నుడిని కాలేకా, నాలో నేనే యెంతో కుమిలిపోయేను. నీ పట్ల నే నెన్నడూ ఆ భావాన్ని సృష్టించుకో లేదు. మావయ్యే ఈ విషయంలో జోక్యం చేసుకుని యింట్లో అందరికీ చెబుతూంటే యిప్పుడు నేనిలా పరిగెత్తుకు వచ్చేను నీ దగ్గరికి' అన్నాడు. అతని కళ్లల్లో జయపట్ల గౌరవం ప్రతిఫలిస్తోంది.

క్షణకాలం పరకాయించి చూశాక అతను స్టూలుమీద చతికిలబడిపోయి జయ రెండు చేతుల్నీ బలవంతంగా పట్టుకుని మంచం మీద కూర్చోబెట్టాడు. జయ మొహంలో అనేకభావాలు సంఘర్షిస్తున్నాయి. 'నెమ్మదిగా యిదేమిటి బావా?' అని అడిగింది.

కాళిదాసు తలెత్తి: 'నువ్వు చాలా మారి పోయేవు జయా. నీలో బాధయేమిటో చెప్పు. నేనున్నాను. మనసులో యేదో పెట్టుకుని మథన పడిపోతున్నావు. నిన్ను గురించి యెవరూ యీ యింట శ్రద్ధ తీసుకోవడం లేదు. తల్లి, తండ్రీ అందరికీ నువ్వంటే పంచ ప్రాణాలూ. కానీ అంతచనువు యెవరూ కనిపించనీయరు.

మనిషి స్వభావం కఠినంగా మారిపోయే పరిస్థితులు యిలాంటివే. చెప్పు జయా నువ్వు యెవరినైనా యిష్టపడ్డావా. ఇంత దానివిగా వున్నప్పుడే ఓపికగా వినేవాడిని నేను. చెప్పు నీకు కావలసింది యిచ్చే బాధ్యత నాది,' అన్నాడు.

జయ చాలాసేపు మాట్లాడలేదు. అతను అంత కంతకు అడగడంతో జయే నెమ్మదిగా సంభాషణ కుపక్రమించింది: 'నీ కెలా తెలుసును అని అడిగేవు. భారతి విషయం కాలేజీలో అందరికీ తెలియదను కున్నావా. అసలు మీ యిద్దరికీ పరిచయం యెలా అయింది?'

కాళిదాసు సమాధానం యిచ్చేడు: 'వాళ్లమ్మగారికి జ్వరం వచ్చినప్పుడు నాకు తెలిసిన డాక్టరుచేత ట్రీట్‌మెంటు యిప్పించేను. అప్పటినుంచి వాళ్ల కుటుంబంలో వో మనిషినైపోయాను.'

జయ అన్నది: 'నువ్వు మరోకలా భావించకు కాళీ! నాన్నగారే పట్టుపట్టి నీకు యీ పెళ్లి కుదిర్చివుంటే భారతికి అన్యాయం చేసేవాడివి కావంటావా?'

కాళిదాసు తల దించుకున్నాడు: 'నిజం చెప్పాల్సి వచ్చింది కనుక చెబుతున్నాను జయా. శీలవంతులైన స్త్రీ పురుషు లెవరైనా ప్రప్రథమంగా మనసులో ప్రతిష్ఠించుకుని ఆరాధిస్తున్న మనుష్యుల్ని అంత తేలికగా మెరుపుకోరేరు. నా పట్ల విధి వక్రించి, దైవం ప్రతికూలించి వుంటే నేను...మగవాడు, పిరికివాడు అనే మాటల్ని సంతోషంగా భరించేవాడిని.'

'అంటే'

'మనసున్న మనుష్యులందరూ ఒక్కటే జయా! అందులో స్త్రీ పురుషుల భేదం కనిపించదు. గుక్కెడు ప్రాణం తీసుకునేందుకు డాక్టరీ చదివే నాకు మార్గమే కనిపించకపోయేదంటావా?'

జయ ప్రాన్పడిపోయింది.

కాళిదాసు కనుకొలుకుల్లో అస్పష్టంగా నీళ్లు విరిచేయి: 'భారతిని నువ్వు చూసేవుంటావు. నా మొహం. నీ కన్న పరిచయం భారతితో మరో ఆడపిల్లకి లేదేమో కూడా భారతి కాలేజీకి వేసుకు వచ్చే బట్టలు నీకు తెలీదా యెంత ఖరీదైనవో. కడుపు మాడ్చుకుని చదువు కోసమే ఆ పిల్ల యెంత కష్టపడుతుందో ఆ మాత్రం గ్రహించకపోవు'

'నన్ను నమ్ముకుని బ్రతుకుతున్న భారతికి అన్యాయం యే నాడూ చేయ దలుచుకోలేదు.' కాళిదాసు తలెత్తి జయ వైపు చూసేడు: 'చూడు జయా! నా




NSF




NSF
NSF
NSF
NSF
NSF
NSF
తయారుచేయువారు:
ది నిజామ్ షుగర్ ఫ్యాక్టరీ లిమిటెడ్
శక్కర్‌నగర్, నిజామాబాద్ జిల్లా
కేంద్ర కార్యాలయము:
ఫతేమైదాన్, హైదరాబాద్-4
(ఆంధ్ర ప్రదేశ్)

మీద నీకు కోపంగానీ లేదుకదా ?'

'కోపమా ? దేనికి ?'

'భారతితో ప్రేమకలాపాలు సాగిస్తూ నిన్ను యీ విషయం గురించి అడగటంలో...'

'అదేమీ లేదు'

మాటల సందర్భంలో కాళిదాసు వచ్చిన పని మరిచి పోయేడు జయ వెళ్ళిపోయే అతనివైపే చూస్తూండి పోయింది యెంతో సేపు

కాళిదాసూ, జయా ఒకే రోజున బయలు దేరారు. మనోరమ కొడుకునీ, మేనకోడల్నీ వెరవిడిని ఒకరి బాధ్యత మరొకరి కప్పగించింది. రమ కంట తడిపెట్టింది. భర్తకు దగ్గరగా వెళ్ళి అతన్ని నిలదీసి ప్రశ్నవేసింది. 'మీరు దాన్ని నాకు దూరం చేస్తున్నారు. ఒక్కగా నొక్క పిల్ల వర ప్రసాదంలా పుట్టింది. చదువులనీ, వుద్యోగాలనీ నాకు కాకుండా చేస్తున్నారు.'

కదిలిపోతున్న రైలువైపూ పిల్లల వైపూ చూస్తూ అతను వేదాంతిలా నవ్వేడు. 'మన కాలంలోనే ఆడపిల్లల చదువుపట్ల ప్రత్యేకమైన శ్రద్ధాసక్తులు వుండేవి. కాలం సాగుతూంటే మనం వెనక్కి జంకడం యేమంత మంచిపని కాదు. ప్రగతి పథంలో అందరితో బాటే మనం. మద్రాసు కాలేజీ మొత్తంలో మన

# పరిలిప్తం

జయ ఒక్కతే వుండివుంటే నువ్వు బాధ పడినా నీమాట తప్పకుండా వినేవాడిని నేను కానీ...మనలాంటి చాలామంది తల్లి తండ్రులు పిల్లల్ని చదువులకోసం పంపిస్తున్నారని ఒక్కసారి ఆలోచించు!' అతను మాట్లాడినట్టే వున్నా అది చండశాసనంలా వినిపించి రమ నోరు మూత వేసుకుంది.

* * *

ఇచ్చిన సెలవలు యిట్టే గడిచి పోయేయి కలవరించిన మద్రాసుమీద కాలు మోపగానే జయకి యేనుగు యెక్కినంత వుత్సాహం, బలం వచ్చేయి. ఈసారైనా సాంబశివానికి నిజం చెప్పేయాలనుకుంది వొకటికి రెండుసార్లు. కాలేజీలు తెరిచారు. యెవరిదారిన వాళ్ళు పుస్తకాలు దులుపుకుని బయలుదేరారు విద్యార్థులందరూ.

వరసగా సాంబశివం కాలేజీకి నెలరోజులు రాలేదు. జయ మనసుని పుస్తకాల మధ్య బిగించింది. సాయంకాలం బీచిలో కూర్చుని వుండగా సాంబశివం గుర్తుకు వచ్చేడు. సముద్రపు కెరటాలు పైపైకి పొంగి పెళ్ళున విరిగి వెనక్కి పడిపోతున్నాయి.

'యిప్పుడే సాంబశివం వుండివుంటే' జయ మనసు తలెత్తింది. దూరంగా రాయి మీద కూర్చుని తదేకంగా సముద్రంవైపే చూస్తున్న అతను జయదృష్టిని క్షణంలో ఆకర్షించేడు. జయ సంకోచించ లేదు. త్వర త్వరగా అతనిని చేరుకుంది. అడుగుల చప్పుడుకు అతని పరధ్యానం పూర్తిగా వదిలిపోయింది. తలెత్తిచూసి 'ఓ! మీరా, రండి, కూర్చోండి' అన్నాడు.

జయ అతని యెదురుగా కాసేపు కూర్చుంది. అదే చిన్నతనం అయివుంటే? జ్ఞాపకాలు వెనక్కి మళ్ళాయి. పన్నెండేళ్ళ సాంబశివాన్ని సతాయించడం జయకి మరీ వేడుక. ఆ వేడుకే యిప్పుడు జ్ఞాపకంచేసి అతని భుజాలమీద చేతులు వేస్తే? యింగ్లీషు దొరల్లావుండే సాంబశివాన్ని మరిచిపోవడం అదంత తేలికే అను కున్నాడా? ధనవంతులకుండే గర్వంవల్ల అబద్ధం ఆడిందని అతననుకోడా? నిజాన్ని ఆక్షణంలో తను దేనికి దాచిందో అర్థం కాలేదు.

'సెలవలు సరదాగా గడిచేయను కుంటాను. కాళిదాసు చెప్పేడు' సాంబ శివం ప్రసంగంలోకి దిగేడు.

జయ తలెత్తింది: 'అయితే పెళ్ళి విష యంకూడా చెప్పేడా?'

'పెళ్ళా!' సాంబశివం కొద్దిగా ఆశ్చర్య పోతూ స్వరాన్నితగ్గించి అన్నాడు. 'చూడండి జయా మరోవిధంగా అనుకోకపోతే కాలే జీలో అందరూ అనుకునేది అబద్ధం అనే అంటారా?'

జయ తటపటాయించింది కొంచెంసేపు 'అదేం కాదు. బావ భారతిని యిష్టపడి చేసుకుంటున్నాడు. నాన్నగారు ఈ నెల్లోనే వస్తారు. సంబంధం యెలాగూ స్థిర పడింది కనుక యిక్కడే చేసేందుకు'

'అయితే మీరు...'

'బావా నేనూ చిన్నప్పటినుంచీ చాలా స్నేహితులం.. స్నేహంకోసమే ఒకళ్ళకోసం ఒకళ్ళం బ్రతుకుతున్నాం. ఈ వయసులో నేను పడేబాధను అర్థం చేసుకున్నది బావ ఒక్కడే!'

'అంటే'

జయ నిర్భయంగా బదులు చెప్పింది: 'నువ్వు.. నువ్వు సాంబువని నాకు తెలుసును. నిన్ను గుర్తుపట్టేను నేను మొదటి రోజునే. కానీ...మన స్నేహాన్ని నువ్వు



కాలేజీలోకూడా మరిచిపోకపోతే నాగురించి వలుగురూ రకరకాలుగా అనుకుంటారని బాధపడ్డాను. అందుకే నిన్ను గుర్తు పట్టనట్టు ప్రవర్తించేను. కాని యెన్నాళ్ళని సాగించగలిగి రాగుడ మూశాం. మానసికంగా రంపపుకోత ననుభవిస్తూ నవ్వు నటించేను. నా మాటకు యెక్కడా యెప్పుడూ కూడా తిరుగులేదు సాంబా! జయ రెండు చేతులమధ్యా మొహాన్ని దాచు కుని బావురుమంది.

సాంబశివం బిత్తరపోలేదు. చుట్టూ చూసేడు అప్పటికే సంధ్యచీకట్లు ప్రపం చాన్ని మెల్ల మెల్లగా ఆక్రమించుకుంటు న్నాయి పిల్లలు యింక లిప్పట్లోంచి లేచారు, పెద్దల వెనకే అనుసరిస్తూ. కుర్రకాడు భుజానికి తగిలించుకున్న ట్రాన్ సిస్టర్‌లోంచి సినిమా పాట సన్నగా విని పిస్తోంది నలుగురైదుగురుగా చేరి దూరం గా నిలుచున్న కాలేజీ పిల్లల దృష్టి యిటువైపే వుంది. సాంబశివం అన్నాడు: 'నన్ను గుర్తుపట్టనట్టు ఎలా ప్రవర్తించావని ఎంత పిచ్చిదానివి? మాట మాత్రంగా అనిపించేటే నేను నా ప్రవర్తనలో లోపాన్ని కనిపించనివ్వకుండా జాగ్రత్తగాచూసుకునే వాడిని కదా జయా! నీకు తెలీదు లప్పుడు అంతే ఆ చిన్నతనంతో నువ్వు వదిలి వెళ్లి పోతున్నందుకు యెంత బాధ పడ్డానో దేవుడికి తెలుసును. తరువాత...

'తే నా తండ్రి కదూ! మనం విమానం యెక్కి అమెరికా వెళ్లిపోదాం అక్కడ యెంత బావుంటుందో తెలుసా మంచి మంచి బొమ్మలూ, పుస్తకాలూ చాలా వుంటాయి.' జానకి కొడుకుని ఫ్లాట్ ఫామ్‌మీద దొర్లుతూంటే యెత్తుకుని వూరడిస్తోంది

సాంబశివం తలకి యే మాటా యెక్క డంలేదు 'జయా'. అంటూ యేడుస్తూంటే అతని గొంతు బొంగురుపోయింది. నోట్లో కదిలే మాటలు గొంతు చీల్చుకుని రావడం లేదు కళ్ళు యెరుపు రంగుకి మారిపోయి రక్తపు ముద్దల్ని గుర్తుకు తెస్తున్నాయి అసలే పసుపు రంగులోవుండే అతని మొహం గులాబీ రంగుకు మారిపోయి కళ్ల నీళ్ళు మాటి మాటికీ తుడుచుకోవడంవల్ల నల్లటి చారికలు అలుముకున్నాయి గిరిధర్ కొడుకుని చేరదీసి అన్నాడు: 'నువ్వు యేడ వకు. జయ యెక్కడికీ వెళ్లలేదు. ఇప్పుడు పని తగిలింది కదూ అందుకే వాళ్ల నాన్నగారు వూరికి తీసుకువెళ్ళారు. త్వరగా వచ్చేస్తుంది. మనం అమెరికానుంచి రాగానే నిన్ను జయ దగ్గరకి తీసుకువెడతాను నేనే.'

సాంబశివం మనసు కుదుటపడలేదు. మర్నాడు స్కూలుకు వెళ్ళేందుకు పుస్తకాల సంచి దులుపుకుని భుజాన వేసుకున్నాడూ తలుపులన్నీ మూసుకుపోయిన ఆ వీధిలో యెండలు కారణంగా బయటికి వచ్చే సాహసం చేయడంలేదు యెవరూ. సాంబ శివానికి సెలవలిచ్చిన సంగతి గుర్తులేదు.

గభే టీచర్‌గా చేరి హెడ్‌మాష్టరుగా రిటైరు అయ్యాడు వచ్చిన ప్రావిడెండ్‌ఫండ్‌తను దాచుకొన్నది కలిపి యింటిని కట్టించాడు. ఉన్న ఇద్దరు కొడుకులూ చక్కగా మంచి ఉద్యోగాలలో వున్నారు తల్లికీ—తండ్రికీ పుష్కలంగా సరిపోయేంత డబ్బు ప్రతినెలా పంపుతున్నారు. గభేకి రిటైరయిం తరువాత ఎన్నడూ డబ్బు ఇబ్బంది రాకపోవటంవల్ల—ఇంటిలోని ఒక భాగాన్ని అద్దెకిద్దామన్న ఆలోచన మేము వెళ్లి అడిగేదాకా రాలేదు. ఆయన కున్నవి రెండే రెండు బాధలు. ఒకటి — ఒంటరితనం. రెండు—సెరబ్రల్ థ్రాంబసిస్. ఆ జబ్బు రెండేళ్ల క్రిందట వచ్చి ఆయనను అటో యిటో తేల్చటానికి ప్రయత్నించిందని — కానీ ఆయన మొండిగా లొంగక పోవటం వల్ల ఆయన్ను క్షీణింపజేసి వదిలిపెట్టిందనీ—ఆయనే ఓ రోజు మాటల సందర్భంలో చెప్పాడు. '

అయన పెద్దకొడుకు ఢిల్లీలో ఏదో పత్రికలో పని చేస్తున్నాడు. చిన్న కొడుకు బొంబాయిలో బ్యాంకులో వున్నాడు. ఆ రెండు వుద్యోగాలకూ సెలవులు దొరికే అవకాశం లేదు కాబట్టి కొడుకులు చాలా తక్కువగా వస్తుంటారని గభే చెప్పాడు అందుకనే ఆయననూ, ఆయన భార్యనూ ఒంటరితనం— మేము ఆ గదిలో అడుగు పెట్టేంతవరకూ వేధించి — బ్రతుకంటే ఒక విరక్తతను పెంచింది.

మేము ఆ గదిలో ప్రవేశించగానే — అప్పటివరకూ యాంత్రికంగా నడుస్తున్న ఆ దంపతుల జీవితంలో కొన్ని మార్పులు అనుకోకుండానే వచ్చేశాయి

ఉదయం ఏడు కాగానే గభే మా గది తలుపును క్రమం తప్పకుండా తట్టడం అలవాటు చేసుకున్నాడు. లోపలికి వచ్చి కాసేపు మాతో పిచ్చాపాటి వేసుకోవటం ఆయన కార్యక్రమంలో విధిగా చేరిపోయింది మాకు మొదట్లో విసుగ్గా వుండేది. కమ్మని నిద్రను—క్రూరంగా—ఏడు గంటలకే వదిలిపెట్టాల్సొంటే ప్రాణం మీదికి వచ్చేది. కొద్ది రోజుల తర్వాత మాతో వచ్చి ఏడు గంటలకు మాట్లాడటం ఆయన దిన చర్యలో కల్సిపోయిందన్న సంగతిని పసిగట్టి — మేము గూడా మున్సితంగా ఆ సమస్యను పరిష్కరించటానికి పూనుకొన్నాం. వంతు చొప్పున ఆయనతో మాట్లాడటానికి నిర్ణయించుకున్నాం. అంటే ఈ రోజు రాంచందర్ నిద్ర పోతుంటే — నేను ఆయనను ఎంగేజి చేయాలన్న మాట! రేపు నేను మాట్లాడుతుంటే రాంచందర్ నిద్ర పోవచ్చు—ఇద్దరం కల్సికట్టుగా ఆయనతో సంభాషణలో భాగం పంచుకోక పోవటానికి ఒక చక్కని కారణం కనిపెట్టాం—రాత్రి పొద్దుపోయిందాకా చదవటం అలవాటు చేసుకుంటున్నామని—ప్రతిరోజూ ప్రొద్దుపోయిందాకా చదివితే ఆరోగ్యం పాడవుతుందని—దినం విడచి దినం—ఆలస్యంగా మేల్కొని వుండటానికి నిర్ణయించుకున్నామని—పుస్తకాలు యిద్దరికీ సంబంధించినవి ఒక్కటే సెట్టు మాదగ్గర వుండటంచేత ఒకరోజు ఒకరు ప్రొద్దుపోయిందాకా చదివితే—యింకో రోజు యింకొకరు చదువుతారనీ! ఆయన రాగానే మా టైంటేబిల్ ప్రకారం మా యిద్దరిలో ఒకరు లేచి ఆయనతో మాట్లాడుతుండేవాడు. టైంటేబిల్‌లో నిద్ర పతించిన వ్యక్తి — ఆయన రాగానే మంద

నా వడిశం—దగ్గూ తగ్గించేకార్యక్రమంతో పడటంతో నాపని విషమించింది.

భార్యకు ఏదో కషాయం తయారు చేయమని చెప్పాడు. అర్జంటుగా లేచి మొహం కడుక్కోమని నన్ను పురమాయించాడు. 'ఎబ్బే ఊరికనే తగ్గిపోతుంది. నాకిది అలవాటే'నని ఎంత చెప్పినప్పటికీని విన్పించుకోలేదు. కషాయం తయారుచేసుకొని వచ్చి మాతాజీ ఆముదం త్రాగటానికి మారాంచేసే పిల్లవాడిని తల్లి ఎంత కరుణతో చూస్తుందో అంత కరుణతో నన్ను చూడసాగింది.

గభేకు అకస్మాత్తుగా వెనుక తను టీచరుగా ఎంత కఠినంగా వుండి జ్ఞాపకం వచ్చింది కాబోలు—నా పట్ల కఠినంగా మారిపోయి ఆ మందు త్రాగకపోతే జబ్బు ఎంతగా విషమించేది వివరిస్తూ చెప్పి బెత్తం ఆడిస్తున్నట్లుగా పేపరు ఆడించసాగాడు.

రాంచందర్ గోడవతల నిల్చొని పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వుతున్నాడు.

నాకు గత్యంతరం లేదు. గుటుక్కు గుటుక్కున కషాయాన్ని మింగాను. కషాయంలోని ఘాటానికి కళ్లవెంబడి నీళ్లు రాసాగాయి. గభే శరీరంలో కూడుకున్న జబ్బు ఆ విధంగా బయటికొస్తుందని అది మంచి సూచనని తన కషాయాన్ని మెచ్చుకోసాగాడు. ఆయన చెప్పిన కారణం వినగానే - మరింత ధారతో నా కండ్లు వర్షించసాగాయి. కషాయం నా వంటికి పడకపోవటంవల్లనో ఆరోజు గొంతంతా భారంగా వుండటంచేత తిండి తినకపోవటంవల్లనో నేను నీరసించిపోయి నిజం జ్వరం వచ్చినవాడిలా పడిపోయాను. రాంచందర్ నాకు సంభవించిన అవస్థకు నిజంగా జాలిపడి సానుభూతి ప్రకటిద్దామని ప్రయత్నించాడు [illegible] నా మంచంవద్దకు రాగానే అప్రయ[illegible] ఆ సంఘటన జ్ఞాపకంవచ్చి తెరలు తెరలుగా వస్తున్న నవ్వును ఆపుకోలేక [illegible]క్క పొడుగాను' అంటూ [illegible] తనివితీరా నవ్వుతుండేవాడు. నాకు వళ్ళుమండి దుప్పటి బిగించి ఆ రోజుకు ఇక లేవలేదు.

రాంచందర్‌కు ఇంగ్లీషులో వ్యాసాలు వ్రాసి పత్రికలవాళ్ళకు పంపే అలవాటు వుండేది. గభేకి వ్యాసాలు వ్రాసేవాళ్ళన్నా కథలు వ్రాసేవాళ్ళన్నా అంతగా సద్భావం లేనట్లు మాటల్లో ఒకసారి బయట పెట్టాడు. మామీద ఏర్పడిన మంచి అభిప్రాయం మరింత ఇనుమడింపజేసుకుందామని కాబోలు ఒకరోజు రాంచందర్ నన్ను గురించి— 'ఈయన కథలు అవీ వ్రాస్తాడని' చెప్పాడు. గభే ఆముదం త్రాగినట్లుగా మొహంపెట్టి కండ్లు చిట్లించి నన్ను చూసాడు. అప్పటినుంచీ రవ్వంత నామీద చెడ్డ అభిప్రాయం కల్గిందని నా ఊహ. అప్పుడప్పుడూ 'కథలు వ్రాయటం అంత మంచిపని కాద'ని టైము వృథా చేయవద్దని నన్ను హెచ్చరించాడు కూడా.

ఒకరోజు రాత్రివేళ రాంచందర్ తను వ్రాసిన ఇంగ్లీషు వ్యాసాన్ని ఫెయిర్ చేస్తున్న తరుణంలో గభే తలకు నిండుగా మఫ్లర్ చుట్టుకొని మా గదిలోకి ప్రవేశించాడు. నవల చదువుతున్న నేను టక్కున మూసేసి ఆయన గమనించక ముందే పెద్దసైజు పుస్తకాన్ని చేతిలో పట్టుకొని ఆయన్ను పలకరించాను.

నన్నూ—నా చేతిలోని పెద్దసైజు పుస్తకాన్నీ తృప్తిగా చూస్తూ 'చదువుతున్నారన్నమాట' అన్నాడు.

తలూపాను రాంచందర్ ఇబ్బందిగా పెన్ను మూయబోయాడు గభేకి రాత్రివేళ రాతపని చేసేవాళ్ళన్నా కోపమే ఏదో అత్యవసర సమయాల్లోతప్ప రాత్రిపూట వ్రాయకూడదంటాడు.

రాంచందర్‌నుమాసి కండ్లు చిట్లిస్తూ 'ఏదో వ్రాస్తున్నట్లుందే?' అన్నాడు.

రాంచందర్ ఇబ్బందిగా నావైపు చూసాడు.



నేను అవకాశాన్ని జారవిడువదల్చుకో లేదు...'ఏం లేదండీ రాంచందర్ అంటే ప్రొఫెసర్‌కు మంచి అభిప్రాయం వుంది. ఏదో ట్యుటోరియల్ అర్జంటుగా తయారు చేసుకొని రమ్మంటే వ్రాస్తున్నాడు' అన్నాను.

రామచందర్ బిత్తరపోయాడు. గభే తలూపి, ప్రొఫెసర్‌ను గురించి వాకబు చేసాడు. అన్ని వివరాలు చెప్పిన తరువాత — ప్రొఫెసర్ మా వీధిలోనే వున్న సంగతి జ్ఞప్తికి వచ్చింది.

గభే నేను చెప్పిందంతా తలూపుతూ విని—తాపీగా 'మర్చిపోయాను ఇన్నాళ్ళనుంచి. మీ ప్రొఫెసర్ నాకు తెల్సు నేను మీ విషయం కనుక్కుంటానులెండి. ఏదైనా సహాయం కావాల్సింటే చెప్పండి — ఆయనతో మాట్లాడుతాను' అన్నాడు.

మా ఇద్దరికీ దిగులు పట్టుకుంది. కొంపదీసి ప్రొఫెసర్‌ను కల్సుకొని మమ్మల్ని గురించి వాకబు చేస్తాడేమోనని!

రెండోరోజు ఆ ట్యుటోరియల్ సంగతే మేమిద్దరం మర్చిపోయి వుండగా — 'ఆ ట్యుటోరియల్ మీ ప్రొఫెసర్ కిచ్చారా?' అని అడిగాడు.

రాంచందర్ తలూపాడు. ఇచ్చినట్లుగా ఆయన అర్థం చేసుకున్నాడు మా ఇద్దరికీ భయం పట్టుకుంది. ఏ క్షణంలో ఆయన ప్రొఫెసర్‌తో మాట్లాడి మా అసలు సంగతి తెల్సుకుంటాడో అని.

రెండు రోజుల తరువాత గభే మా గదిలోకి వచ్చి—'మీ ప్రొఫెసర్‌ను కలుసుకున్నాను' అన్నాడు.

మా ప్రక్కనే బాంబు ప్రేలినట్లుగా ఇద్దరం ఉలిక్కిపడ్డాం. రాంచందర్‌కు మాట తడబడింది. నాకు వళ్ళు తిరగ సాగింది.

అతి కష్టంమీద 'ఏమన్నాడు?'— అన్నాడు.

గభే పరిహాసానికి అంటున్నాడేమోనని— ఆయన్ను పరీక్షించి చూసాంకానీ—అదేంలేదు ఆయన చాలా సీరియస్‌గా చెప్పుకొని పోతున్నాడు.

'నేనా కాగితాలసంగతి అడిగి — మీకిచ్చారా అంటే—చాలాబాగుంది ఇచ్చారు— అన్నాడు—కానీ మీపేర్లే సరిగ్గా ఆయనకు జ్ఞాపకంలేవు'—గభే చివరిమాటవిని ప్రాణం

## అద్దెకిచ్చిన హృదయం

తీసుకొని మేమిద్దరం సర్దుకొని కూర్చున్నాం.

రెండోరోజు సాయంత్రం ఆ వీధిలోంచి వస్తుండగా - గభే మరొకరి యింటిముందు ఎవరితోనో మాట్లాడుతూ నిల్చొని వున్నాడు.

మమ్మల్నిద్దర్నీ చూడగానే ఆనందంతో కేకేసి — ఆయనకు వీళ్లేనన్నట్లుగా చూపించాడు.

మొదట ఆయన మమ్మల్ని అపరిచితుల్ని చూసినట్లుగా చూసి — తరువాత త్రిప్పుకొని — 'హో — వీళ్లెందుకు తెలియదు - బాగా తెల్సు — మంచికుర్రాళ్లు' అని యింగ్లీషులో చెప్పసాగాడు.

మా యిద్దరికీ అర్థంగాక వొకరి మొఖాలు వొకరు చూసుకున్నాం. గభే — మమ్మల్నిగురించి అరగంట చెప్పాడు — రాత్రిపూట మేమెంత శ్రద్ధగా చదివేది — ఎంత శ్రద్ధగా ట్యుటోరియల్స్ వ్రాసేది అన్నీ చెప్పి - చివరకు — మాకు అన్నివిధాలా సహాయం చేయవల్సిందిగా ఆయనకు మరీ మరీ చెప్పి — ఇంటివైపు నడక సాగించాడు

ఆయన — 'భయపడకండి ఆయన తరహే అంత! ఆ జబ్బు వచ్చిందగ్గర్నుంచీ ఆయనకు జ్ఞాపకశక్తి తక్కువయిందను కుంటాను. ఆ మధ్య నెప్పుడో వచ్చి — మిమ్మల్నిగురించే అనుకుంటా — ఏదో చాలా సేపు చెప్పాడు. నేను అన్నిటికి తలూపాను. అటువంటివాళ్ల దగ్గర ఎదురుచెప్పకుండా వుండటమే - ఏమంటారు?' ఆయన నా భుజంతట్టి తనఇంట్లోకి దారితీసాడు —

అక్కడ వ్రేలాడుతున్న బోర్డును అప్పుడు చూసాం —

ఆయన పేరుతోబాటు — 'ప్రొఫెసర్ ఇన్ సైకాలజీ' అనివుంది. మా సబ్జక్టు 'పొలిటికల్ సైన్సు'!

* * *

మేము సెకండ్ టర్మ్ సెలవులకు యింటికిపోయిన తరువాత — కొద్ది రోజులకే — నాకో చిన్న ఉత్తరం ఇంగ్లీషులో వచ్చింది. 'రామకృష్ణా — క్షేమంగా చేరావనుకుంటాను యిక్కడ మీ రెళ్లిన తరువాత మాకేం తోచటంలేదు. ఏదో పోగొట్టుకున్నట్లుగా వుంది. మాతాజీ మిమ్మల్ని గురించే ఎప్పుడూ అనుకుంటుంది. రాంచందర్‌కు కూడా ఉత్తరం వ్రాస్తున్నాను. సెలవులు అయిపోగానే త్వరగా బయలుదేరి వచ్చేసెయ్యండి - లేకపోతే చదువు పాడవుతుంది — మీ వాళ్లకు నా అభివందనలు'

ఆ ఉత్తరం చూడగానే — ఆయనఆకారం జ్ఞాపకానికివచ్చి నవ్వువచ్చింది కానీ — ఎందుకనో వెనువెంటనే జాలికూడా వేసింది. మమ్మల్నిద్దర్నీ ఎంతగా అభిమానిస్తున్నదీ అర్థమయింది — హాస్యంకోసం — ఏదో సరదాకని మేము ఆయనతోచెప్పిన అబద్ధాలు — ఆడిన నాటకాలు జ్ఞాపకంవచ్చి కొంచెం సిగ్గేసిందికూడా.

సెలవు లయిపోగానే రాంచందర్ నేనూ - సిటీ కొచ్చేసాం. మమ్మల్నిద్దర్నీ గభే దంపతులు ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించారు. గభేకు కండ్లలో నీళ్లు నిండుకున్నాయి. దవడలను చప్పరించుకుంటూ — ఆయనకంటే ఎంతో ఎత్తుగా వున్న మా యిద్దరి చేతులూ పట్టుకొని మధ్యలో నిల్చున్నాడు.

నా వైపు తిరిగి 'రాంచందర్ మీరు లేకపోతే నాకేం తోచలేదు—' అన్నాడు. అప్పు డర్థమయింది నాకు ఉత్తరంలో నా పేరు సక్రమంగా వ్రాయటానికి కారణం మేమిచ్చిన అడ్రసులని!

మాకోసం మాతాజీ బాయిలర్‌లో వేడి నీళ్లుంచింది. స్నానాలయిన తరువాత చిక్కని టీ తీసుకొనివచ్చి యిచ్చింది.

ఆ యింట్లో మళ్లీ మేమిద్దరం తిరుగాడుతుంటే గభే అర్ధనిమీలిత నేత్రుడై వాలు కుర్చీలో హాయిగా పడుకున్నాడు. మాతాజీ కండ్లలో కాంతి నింపుకొని ఆ రాత్రి మమ్మల్నిద్దర్నీ భోజనం అక్కడే చేయమని సంజ్ఞలద్వారా చెప్పసాగింది. మేమిద్దరం ఆ యింట్లోని సభ్యులుగా మారిపోయాం. ఏ అడ్డంకూ లేకుండా కాలం గడిచిపోతున్నది. కానీ మా చదువే కుంటుబడసాగింది.

పరీక్షలు యింకా రెండునెలలున్నాయనగా మాకు చదువును గురించిన భయం పట్టుకోసాగింది. దీక్షగా చదవటానికి రెండుమూడుసార్లు ప్రయత్నించాం కానీ ఆ గదిలోని వాతావరణం చదువుకు అనుకూలంగా లేనట్లు ఎందుకనో మా యిద్దరికీ అన్పించసాగింది. పుస్తకం పట్టుకోగానే ఎంతవద్దనుకున్నా యిద్దరికీ నిద్రవచ్చేసేది. ఆ వీధిలో ఎవరూ మిత్రులు లేకపోవటంవల్ల రాత్రిళ్లు ఉత్సాహంగా చదువుకోడానికి తగిన వాతావరణం లేనట్లుగా ఏదో కొరతగా వున్నట్లుగా మాలో బలమైన అభిప్రాయం ఏర్పడసాగింది. రాత్రిళ్లు బయటకువెళ్లి టీ త్రాగివద్దామన్నా గభే దంపతులు ఆరోగ్యం పాడవుతుందని నిషేధించేవారు. వాళ్లమాట అంతగా పట్టించుకోవాలని లేకపోయినా ఎందుకనో వాళ్లిద్దర్నీ నొప్పించకుండా వుండడానికి మేము అలవాటు పడ్డాం.

అనుకోకుండా రెండుమూడు వీధులవతలున్న మా స్నేహితుడొకడు ఒకరోజు ఆదరాబాదరావచ్చి మమ్మల్నిద్దర్నీ ఏదో మంచి గది ఖాళీ అయిందనీ ప్రక్కగదుల్లో అందరూ విద్యార్థులే ఉండటంవల్ల చదువు సక్రమంగా సాగుతుందనీ హాస్టలు ఆ గదికి చాలా దగ్గరనీ అన్నివిధాలా అనువుగా వుంటుందనీ, అనేక విధాలుగా మమ్మల్నిద్దర్నీ ఊరించి గదిని చూడటానికి తీసుకెళ్లాడు.

ఆ గది నిజంగా చాలా బాగుంది. ముఖ్యంగా గదిలోకి గాలి ధారాళంగా వస్తుంది. ఎండాకాలం ప్రవేశించింది కాబట్టి బయట కూర్చొని చదువుకోటానికి వీలుగా బాల్కని వుంది. ఆ మేడ మీద అన్ని గదుల్లోనూ విద్యార్థులే వుండటంచేత 'చిన్న హాస్టల్' లా వుంది. చదువు సక్రమంగా ఆ గదిలో సాగుతుందని ఆ పరిసరాలను చూస్తే ధైర్యం వచ్చింది. అద్దెకూడా మేము అనుకున్న దానికంటే ఎక్కువేంకాదు. మేడమీద ఆ గదిని చూడగానే మేము వుంటున్న గభే యింటిలోని గది ఎంత చీకటో అర్థమయింది. గభే దంపతుల ఆదరణ మినహాయించి చాలా అసౌకర్యాలు ఆ గదిలో వున్నట్లుగా మా స్నేహితులు నూరిపోయసాగారు. గభే యింటిలోని వెనుక భాగంలోవుంది కాబట్టి యింటిచుట్టూ తిరిగిపోవాలనీ గదిలో ఒక ప్రక్కగా గోడ పగిలిందనీ స్నేహితులకు చాలా దూరంగా వుండటంచేత పరీక్ష ముందురాత్రి వెలువడే 'గెస్ పేపర్లు' మాకు అందించటం కష్టమనీ యిలా

(63వ పేజీ చూడండి)

# వారఫలం

## 29-8-1969 శుక్రవారం మొదలు
## 4-9-1969 గురువారం వరకు

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి. మీ తాళాకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారం మధ్యలో వ్యాపారాలలో ఆదాయం పెరుగుతుంది. పాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి.

**వృషభం:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందదు. వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. అధిక వ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. విలాస వస్తువులు కొంటారు.

**మిథునం.** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. నూతన విషయాలను తెలుసుకొంటారు. వారం ఆఖరులో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు—బంధువులకు సహాయం చేస్తారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి . విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**సింహం** కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య:** భాగస్వాములతో కలిసి చేసే • వ్యాపారాలు బాగా ఉంటాయి పాటివారిలో గౌరవం లభిస్తుంది వారం మధ్యలో వృత్తిలో శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం, వస్తుంది. వారం ఆఖరులో అన్నివ్యవహారాల్లోను తిరిగి అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**తుల** వృత్తిలో పాటివారితో పోటీ పెరుగుతుంది రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం ఆఖరులో మీరు ప్రయోజనంలేని శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృశ్చికం:** వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. వృత్తిలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. ప్రయాణాలు స్వల్పంగా లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**ధనుస్సు:** వృత్తి వ్యాపారాల్లో ఆదాయం కంటే ఖర్చు అధికంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు ఫలించగలవు. పాటివారితో మాటపట్టింపులు తగవు

స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరుతాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మకరం** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. పాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేయగలరు.

**మీనం:** అన్ని వ్యవహారాల్లోను అనుకూలమైన మార్పులు వస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

—మహేష్





**ఇంతవరకు కథ**

ముకుందం, సుందరం, ప్రకాశం, శకుంతల, శశి సుభద్రమ్మగారి సంతానం. పొలంమీద వచ్చే ఆదాయమూ, ముకుందం తెచ్చే కొద్దిపాటి జీతమూ వాళ్ళకి జీవనాధారం. విశ్వనాధంగారు ఆ కుటుంబానికి ఆప్తుడు. సుందరం తెలివైన వాడు. అతనికి మద్రాసువెళ్ళి బియ్యే చదవాలని వుంటుంది. మొదట్లో కొంత వెనకాడినా, ముకుందం అతని అభిలాషని తోసిపుచ్చలేక పోయాడు. సుందరాన్ని అంధరూకలిపి మద్రాసు పంపిస్తారు.

## 3

ఓ సంవత్సరం గడిచింది.

ముకుంధం ఆఫీసునుంచి వచ్చి వరండాలో జోళ్ళువిడిచి గదిలోకి వెళ్ళాడు — మొహం గోడవేపుకి తిప్పుకుని మంచంమీద బోర్లా పడుకున్న శకుంతల కనిపించింది.

'అదేం శకూ — ఈ వేళప్పుడు పడుకున్నావేమిటి ? ఒంట్లో బాగుండలేదా.' షర్టు విడిచి ఒంకికి తగిలిస్తూ అడిగాడు.

శకుంతల దగ్గరనుంచి ఎలాంటి సమాధానం రాలేదు. 'నిద్దర పోతోందేమిటి.' మనస్సులో అనుకునే మాట కాస్త పైకే అన్నాడు—అప్పుడే అటువచ్చిన సుభద్రమ్మ 'ఆ — నిద్దరా కాదు — ఒంట్లో బాగుండక పోవటమూ కాదు—పరీక్ష పోయింది.' — అని ఇంకేదో చెప్పబోయి మళ్ళీ అంతలోనే ఇప్పుడా గొడవంతా ఎందుకన్నట్టు మాట తప్పించి—'అందుకు మధ్యాహ్నం నుంచీ ఏడుస్తూ పడుకుంది.' అంది.

'ఇవాళ రిజల్ట్స్ తెలుస్తాయి — స్కూలుకి వెళ్ళాలి' అని ఉదయం పిల్లలు అనుకుంటున్న మాటలు అప్పుడు గుర్తు వచ్చాయి ముకుందానికి — ఇవాళ ఆఫీసులో అర్జెంటుపని వుండటంవల్ల రోజూకంటె ఓ అరగంట ముందుగానే వుడికీ వుడకని అన్నంతినేసి హడావిడిగా వెళ్ళిపోయాడతను. ఆ ఖంగారులో వాళ్ళ మాటలు అంతగా పట్టించుకోనూ లేదు. ఆ తరువాత ఆ విషయం గుర్తురానూలేదు — ఉదయం తొమ్మిదింటికి వంచిన తల మళ్ళీ సాయంకాలం ఆరింటికి ఎత్తినట్లుగా అయింది ఇవాళ అతని పని — ఆఫీసూ, ఎక్కౌంట్లుతప్ప మరో ధ్యాసే పోలేదు...ఇప్పుడు తల్లిమాటలు వింటూ ఒక్కక్షణం ఎలాగో అయిపోయిన అతను 'పరీక్ష పోయిందా' అన్నాడు. ఆశ్చర్యం కంటె బాధే ఎక్కువ ధ్వనించిదతని మాటల్లో.

ఆ అమ్మాయి సంగతి అతనికి తెలియనిదేంకాదు — తెలివితక్కువది అని చెప్పలేం కాని చదువుపట్ల మాత్రం శ్రద్ధ తక్కువ—ఎంతసేపూ పెద్దవాళ్ళ ఖబుర్లు వింటూ కూర్చోడం లేకపోతే ఇరుగుపొరుగు అమ్మాయిలతో ఏ చింతగింజలో ఆడటం మీద వున్న సరదా పాఠాలు చదువుకోటంలో వుండదు. అక్కడికీ ముకుందం మధ్య మధ్య హెచ్చరిస్తూనే వుండేవాడు, 'మొక్కు తీర్చుకున్నట్టు స్కూలుకి వెళ్ళి వస్తూంటే సరిపోతుందా ఏమిటి—ఇంట్లో కూడ బాగా చదువుకోవాలి—అసలు హోమ్ వర్కు అదీ శ్రద్ధగా చేస్తున్నావా— తెలియనివేమైనావుంటే నన్నడుగు చెప్తాను —ప్రకాశం, శశీ, మీరుకూడ నన్నయినా సుందరం అన్నయ్యనయినా అడగండి.' అని.

అన్నగారి మాటలు విన్నతరువాత ఒక రోజూ అరరోజూ కాస్త శ్రద్ధగా పుస్తకం పట్టుకునేది శకుంతల. ఆ తరువాత మళ్ళా మామూలే—ప్రకాశం శశిమాత్రం ఏవో అడిగి చెప్పించుకుంటూండేవాళ్ళు. మంచి మార్కులతో ప్యాసయేవారు— శకుంతలకి ఎప్పుడూ బొటాబొటీ మార్కులే—

జ్ఞానం వచ్చిన ఆడపిల్లని అంతకన్న ఎలా మందలించాలో తెలిసేదికాదు అతనికి— ఆ విషయమే తల్లితో చెప్తే,

'జానే—నిన్ను బియ్యేలూ ఎమ్మేలూ ఎలాగా చదివించం—ఈ స్కూలుఫైనల్ దాకా అయినా మాట దక్కించు.' అని కూతురికి చెప్పి.

'ఏమిటో, మీ నాన్నగారే వుంటే ఈపాటికి దీన్ని ఓ అయ్యచేతిలో పెట్టి బరువు దింపుకుందును.' అంటూ కొడుకు దగ్గర నిట్టూర్పులు విడిచేది...

'సరే ఎలా చదివినా ఎన్నిమార్కులు వచ్చినా ఇప్పటిదాకా పరీక్ష తప్పటం అన్నది జరగలేదు— ఇప్పుడు ఈ ఫిఫ్త్ ఫారంలో ఆ ముచ్చట తీరింది—ఇంకనైనా బుద్ధి తెచ్చుకుంటుంది' అనుకుని.

'చూడు చదువుకునే టప్పుడు శ్రద్ధ వుండాలి. కాని ఇప్పుడు ఏడిస్తే ఏంలాభం?

తెలియనివి ఏమైనావుంటే అడుగమ్మా అని అన్నిసార్లు మొత్తుకున్నా ఒక్కసార్లైనా అడిగి చెప్పించుకునేదానివి కాదు— మీకు వుండాలికాని, అసలే ఆఫీసులో అలిసి సగంచచ్చి ఇంటికివచ్చిన నేను మిమ్మల్ని పేరు పేరునా పిలిచి దగ్గర కూర్చోపెట్టుకుని ఎంతకని చదివించగలను? సరేలే ఏంచేస్తాం ఏదో అయిపోయింది.'— గట్టిగా మందలించినట్లూ కాకుండా, ఓదార్చినట్లూ కాకుండా నాలుగుమాటలు మాట్లాడి పెరటివేపుకి వెళ్ళిపోయాడు స్నానం చెయ్యటానికి—

అతను స్నానంచేసి వచ్చేసరికి ఎక్కడికో వెళ్ళిన సుందరం తిరిగి వచ్చాడు. 'విన్నావా శకుంతల చేసిన ఘనకార్యం' అన్నాడు అన్నగారినిచూస్తూ, అతను శలవలకి వచ్చాడు.

'పోనీలే వూరుకో— అది అసలే ఏడుస్తోంది.' అన్నాడు ముకుందం ఘరే మనాలో తెలియక.

'ఆ—అది ఏడవటంకాదు మనల్ని ఏడిపిస్తుంది— మరి కాస్త శ్రద్ధగా చదువుకోకపోయావా అని మధ్యాహ్నం నేను మాట వరసకి అనేసరికి ఖయ్యిమంటూ లేచింది నామీద— నారాత కొంకిరిగీతల్లా వుంటుందిట— నాపేపర్లు దిద్దటానికి మేష్టర్లు తల్లక్రిందులుగా తపస్సు చేయాలిట—నేను వ్రాసింది అర్థంకాక కొంత, ఒకవేళ నన్ను ఫెయిలు చేస్తే మీదటికి కూడ తమ ప్రాణంమీదికి ఆ పేపరు వస్తుందనే భయంతో కొంతా నన్ను ప్యాసు చేసేస్తున్నారట — విన్ని మాట లందుకున్నావ్......''

విస్మయంగా వింటూ నిలబడిపోయాడు ముకుందం— సోమరితనంతో పరీక్ష పాడు చేసుకుని సిగ్గు పడకపోగా ఎదురు పెద్దవాడిని పట్టుకుని అంతంత మాట లందంటేనే ఏమిటో ఎబ్బెట్టుగా అనిపించింది.

'పోనీలే—ఇప్పుడు మళ్ళీ ఆ గొడవంతా ఎందుకు—అసలే వుడుకుమోత్తనంగా వుండి అదేదో అందని వూరుకోకుండా నువ్వా తిరిగి అన్నావుగా.' అంది సుభద్రమ్మగారు మధ్యలో కల్పించుకుని.

'ఏ మన్నావు ?' అన్నట్లు తమ్ముడి వంక చూశాడు ముకుందం—శకుంతల ఏడుస్తూ పడుకోటానికి కారణం అదే కావచ్చు ననుకుంటూ.

'అవును ఏందు కూరుకోవాలి—నేనూ అన్నాను—ఓ బంగారుతల్లీ నీ అక్షరాలు ముత్యాలకోవలా వుంటాయి—అందుకే ఆ మేష్టర్లకి మచ్చటవేసి మళ్ళీ మళ్ళీ నీ పేపర్లు వాళ్ళదగ్గరికి రావాలని సరదాపడి నిన్ను ఫెయిలు చేసేశారు అన్నాను...'

'నీ వ్యాఖ్యానాలు ఎవరికీ అఖ్ఖర్లేదు కాని నీ చదువులేదో నువ్వు చూసుకో.' అంది శకుంతల రివ్వున లేచివచ్చి.

'ఆ సంగతి నువ్వు చెప్పేదేమిటి— రెండు రోజుల్లో నేనెలాగా వెళ్ళిపోతాను.' అన్నాడు సుందరం అంతకన్నా పౌరుషంగా.

'అబ్బబ్బ—వూరుకోండి—మీ తగూలూ మీరూను.' అంటూ ఇద్దర్నీ మందలించింది సుభద్రమ్మగారు.

సరికొత్త సంగతి తెలుసుకున్నట్లు చిత్రంగా చూస్తూ చిత్తరువులాగే నిలబడిపోయాడు ముకుందం. సరదాకి వాదులాడుకోటమే తప్ప ఇలా కోపంతో మాటా మాటా అనుకోటం అతనెప్పుడలా విన లేదు. అయినా ఎవరిని ఏమనటానికీ అది సమయం కాదనిపించింది—

అలమారులోంచి తమ పేపర్లు తీసుకొచ్చి సంబరంగా మార్కులు చూపిం



వాలనుకున్న ప్రకాశం, శశి అక్కడే నిలబడిపోయారు బిక్కు బిక్కు మంటూ— అది గ్రహించిన ముకుందం వాళ్ళని రమ్మన్నట్టు సౌంజ్ఞచేసి వీధి వరండావేపు దారి తీశాడు.

* * *

స్కూలు తెరిచారు — ప్రకాశం, శశి సరదాగా తయారవుతున్నారు. శకుంతల వంటగదిలో చేరి గంటనుంచీ తల్లిదగ్గర గునుస్తోంది — అంతావిని చివరికి ఆవిడ,

'అయితే అన్నయ్యకి చెప్పివస్తానుండు.' అంటు గదిలోకి వచ్చింది.

'శకు ఇంక స్కూలుకి వెళ్ళనంటోందిరా—' ఆఫీసు బట్టలువేసుకుని అద్దంలో చూసుకుని తల దువ్వుకుంటున్న ముకుందం తల్లిమాటలు అర్థంకానట్టు వెనక్కి తిరిగి అన్నాడు.

'ఎందుకే?' ప్రైవేటుగా మెట్రిక్ పరీక్షకి వెళ్తానంటుందేమో అనిపించిది అతనికి.

'అంటే ఏముంది—దానికి చదువుమీద సరదాలేదు—అయినా వూరికి కూర్చోటం ఇష్టంలేక స్కూలుకి వెళ్ళివచ్చేదనుకో— ఇప్పుడీ పరీక్షపోవటంతో స్కూలు మొహం చూడటానికే సిగ్గుపడిపోతుంది.

'పోనీ ప్రైవేటుగా చదవమను'

'ఆ—ఏమో —అయినా దానికి చదువు మీదకంటె సంగీతం అంటే అభిమానం వుంది — ఆ మూడుముళ్ళూ వేయించి పంపించేలోపున కాస్తంత సంగీతం ఏదో చెప్పించినా తీరిపోతుంది.'

ముకుందానికి బలే చిరాకు వేసుకొచ్చింది. అయినా కాస్త తమాయించుకునే అన్నాడు. దానికిప్పుడు ఎన్నేళ్ళున్నాయని పెళ్ళి పెళ్ళి అంటూ అలా తొందరపడుతున్నావు— అయినా పెళ్ళిమాటలతో అవుతుందా ఏమిటి— సంబంధాలు చూడాలి, డబ్బు చూసుకోవాలి— ఎప్పుడో ఏదో చేస్తామని చెప్పి ఇప్పట్నుంచి చదువు మానిపించి...'

'అది చదువుకోను మొర్రో అంటూంటే నన్నేం చేయమంటావు— అయినా పుత్తిన్నే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోకుండా ఈ సంగీతం ధోరణిలోపడేస్తే బాగుంటుంది— కొంతవరకూ చదువు చెప్పించాం, సంగీతం కూడ చెప్పిస్తున్నాం అని ఆ వచ్చే పెళ్ళి వారితో చెప్పుకోటానికైనా వుంటుంది— దాని సరదాకూడ తీరుతుంది—మర్యా ఆలోచించు—ఆ సంగీతం మేష్టరు ఎంత అడుగుతాడో — మరీ తూగలేమనుకుంటే మానేద్దాం.

సుభద్రమ్మగారు ఆ చివరిమాటలు అనకుండావుంటే ముకుందం నావల్లకాదు అనేసేవాడే— 'స్కూలుఫీజు అయితే నెలకి అయిదురూపాయిల చిల్లర — సంవత్సరం మొదట్లో ఏవో పుస్తకాలూ అవీ కొనటంతో సరిపోతుంది—ఇప్పుడీ సంగీతాలూ భరత నాట్యాలూ అంటూ ఆ మేష్టరు నెలకి ఏ పాతికో తెమ్మంటే తనెక్కడివ్వగలడు— ఇప్పుడు సుందరానికి నెలనెలా డబ్బు పంపించటానికే తనకి కాస్త ఇబ్బంది అవుతోంది—ఆ సంగతి అమ్మకిమాత్రం తెలియదా— తనేదో డబ్బు మూటకట్టుకు కూర్చున్నట్టు ఖర్చుపెట్టటం ఇష్టం లేనట్టు ఇవి కావాలి అవి కావాలి అని అడుగుతా రేమిటి— అంత ఖర్చుకి తూగే తాహతు వుందో లేదో తను ఆలోచించుకో లేదా, నేను ఆలోచించి ఉహూ నావల్లకాదు అని చెప్తే మానేస్తారా—' అతని మనస్సు చివుక్కుమంది—'అందరికీ సరదా అయినదీ అంగీకారం అయినదీ కేవలం తన ఒక్కడి అయిష్టతవల్లే కాకుండా పోయిందీ అనేభావం వాళ్ళకెందుకు కలిగించాలి — నాన్నగారు సంపాదించి పోయిన ఆస్తివుంది-నీ స్వంత డబ్బేదో పెట్టేస్తున్నట్టు అలా పైసా పైసాకి మొహం చూసుకుంటావేమిటి అనే ఆలోచన వాళ్ళకెందుకు కలగనివ్వాలి.' అనుకున్నాడు. అయితే ఆ భావాలేవీ పైకి తెలియనివ్వకుండా ఏదో చెప్దామని ప్రక్కకి తిరిగాడు, అక్కడ సుభద్రమ్మగారు లేరు.

ఆఫీసులో కూర్చున్న ముకుందం మనస్సులో ఉదయం జరిగిన సంభాషణే మెదుల్తోంది— కాస్సేపు ఆలోచించుకుని చివరికి అనుకున్నాడు. 'నా చాదస్తం కాని, ప్రైవేటుగా మెట్రిక్ పరీక్షకి చెప్పించాలన్న ఆ మేష్టరుకి జీతం ఇవ్వొద్దా—అదేదో వాళ్ళు సరదాపడిందే చేస్తే తీరిపోతుంది' అని.

వారం తిరిగేసరికి సంగీతం మేష్టరు కుదిరాడు. నెలకి పదిహేను రూపాయల జీతం—,

చెల్లెలు సంగీత సాధన ఓ ప్రక్కనుంచి సాగుతూంటే మరో ప్రక్కనుంచి తల్లి అతని చెవిలో ఇంకోరకం సంగీతం పాడటం మరీ ఎక్కువయి పోయింది — ఒక్కొక్కసారి కాస్త చిరాగ్గా విసుక్కోవటం కూడ మొదలు పెట్టింది. 'నువ్వు కాస్త శ్రద్ధపట్టకపోతే పిల్లేదు— మాటకి ముందు డబ్బులేదు అంటావు—మరోనాడు మాత్రం మనకి ఎక్కడ్నుంచి వస్తుంది— సుందరం చదువు పూర్తయి, వాడికి వుద్యోగం వచ్చి ఆ డబ్బు నిలవచేసి అప్పుడు దాని పెళ్ళి చెయ్యాలనుకుంటే



# ప్రత్యేక సదుపాయం!

సరకు ఉన్నంత వరకే

~~60~~ పైసల ఖరీదైన ప్రత్యేకమైన
క్రొత్త డిజైను ప్లాస్టిక్ గ్లాసు
10 పైసలకు మాత్రమే మీకు
ఈ డబ్బాలో లభిస్తుంది







ప్రతి డబ్బాలో ఇదివరకు ఉన్నంత బోర్న్విటా
(450 గ్రా. నికరం) ఉంటుంది.

శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం — క్యాడ్బరీస్ బోర్న్విటా!

Bensons/2536 TL

## ఆశ-లా అనుభవాలూ

ఆ సరికి దానికే పాతికేళ్ళొస్తాయి — అయినకాడికి ఏ కరమో రెండెకరాలో తెగనమ్మి బాధ్యత తీర్చుకోవాలి. కాని ఇలా నానుస్తూ కూర్చుంటే అవుతుందా దాని పెళ్ళి...'

తల్లితో వాదించ దలుచుకోలేదు ముకుందం—'ఆవిడ ఆలోచనలూ, అభిలాషలూ తనకి తెలియనివి కావు—నాన్నగారు పోయిన దిగులుతో క్రుంగిపోతూ ఇన్నాళ్ళో ఆవిడ అంత పట్టించుకోలేదు కాని అసలు ఇంతవయస్సు వచ్చిందాకా ఆడపిల్లకి పెళ్ళి చెయ్యకుండా వుంచటం అన్నది, ఈ కుటుంబాలలో ఇంతవరకూ జరగలేదు — నాన్నగారు మరొక్క ఏడాదిపాటు ఆరోగ్యంగా తిరిగి వుంటే అప్పుడే దానిపెళ్ళి జరిగిపోయేది, ఇన్నాళ్ళదాకా వూరుకునేవారా — అసలు దాన్ని మొగపిల్లల స్కూల్లో జేర్పించి చదివించటమే ఆయనకి మొదట్లో ఇష్టం లేక పోయింది—దగ్గరిలో వున్న ఆడపిల్లల స్కూల్లో బొత్తిగా చదువు సరిగ్గా చెప్పటంలేదని ఈ రోజుల్లో మొగపిల్లల స్కూల్లో చదవటం తప్పుగా ఎవ్వరూ అనుకోటంలేదనీ ఎన్నో విధాల తను నచ్చచెప్పిన మీదట కొంత అయిష్టంగానే అంగీకరించారు—అమ్మకూడ ఆ తరానికి చెందినదే—అయినా శకూ మరీ పసిది ఏంకాదు — పదహారేళ్ళున్నాయి — మరో రెండేళ్ళకయినా పెళ్ళి చెయ్యక తప్పదు— అప్పటికయినా అమ్మ సూచించిన మార్గంలో తప్ప తనకి డబ్బు సమకూరదు—' అనుకున్నాడు.

ఇలాంటి విషయాలలో తనకి బొత్తిగా అనుభవం లేకపోవటంవల్ల ఇద్దరు ముగ్గురు పెద్దల చెవిని ఆ విషయం వేశాడు.

'ఇన్నాళ్ళూ నువ్వు చెప్పలేదు కనక మీకింకా ఆ వుద్దేశ్యం లేదేమో అని వూరుకున్నాం—లేకపోతే ఎప్పుడో అయిపోయేది మీ చెల్లెలిపెళ్ళి — నీకెందుకు — నువ్వు నిశ్చింతగావుండు—నెల తిరిగేసరికి నిక్షేపం లాంటి సంబంధం కుదురుస్తాం.' అంటూ వాళ్ళంతా అభయం ఇచ్చారు.

అయినా అందరికీ నచ్చిన సంబంధం రావటానికి ఓ ఏడాది పట్టింది.

పెళ్ళికొడుకు మోహన్ బియ్యే బిఎల్— అతని తండ్రి స్కూలు మేష్టరు— ఉద్యోగం పురుషలక్షణం అని ఆయనా పని చేస్తున్నారేకాని వెనక బోలెడు ఆస్తి వుంది—ఆయనకి నలుగురు కొడుకులూ, ముగ్గురు కూతుళ్ళు—అందరిలోకి పెద్దవాడు మోహన్ — అతనికి ప్రాక్టీసు చెయ్యటం ఇష్టంలేదుట — నెలకి రెండు వందల యాభై వచ్చే వుద్యోగం వుంది, చూడటానికి బాగుంటాడు — అంతకన్న మంచి సంబంధం తన జన్మలో తేలేనని పించింది ముకుందానికి — తాంబూలాలు పుచ్చుకుని సంబంధం నిశ్చయం చేసుకున్నాడు. అందలం ఎక్కినంత సంబర పడ్డాడతను.

కొంత పొలం అమ్మి పెళ్ళి ఏర్పాట్లన్నీ ఏ లోటూ లేకుండానే చేయించాడు. —ముహూర్తం నాలుగురోజు లుండనగానే పటాలంతా వచ్చి దిగారు — మేనమామలు, మేనత్తలు, పినతండ్రులు పినతల్లులు అంతా కుటుంబాలతో సహా వచ్చారు— వాళ్ళ ధోరణిపట్టి మొదటిరోజే ముకుందం గ్రహించేశాడు. 'వీళ్ళంతా ముందుగా వచ్చి వాళ్ళు చేసే సహాయం ఏమీలేదు కాని మేం చేసిన ఏర్పాట్లలో మాత్రం ఏమైనా లోటు వుంటే వెతికి పట్టుకుని మరీ మమ్మల్ని దెప్పుతారు—అవతల మొగపెళ్ళివారితో సమంగా వీళ్ళకి మర్యాదలు చెయ్యలేక సతమతమవాలి.' అని—ఆమాటే తల్లితోనూ తమ్ముడితోనూ అన్నాడు.

'అందరిళ్ళలో నూ వుండేవే ఇవి—మనం పట్టించుకోకూడదు' అన్నారువాళ్ళు— అయినా ముకుందం వూరుకోలేదు—ఆ నలుగురు పెద్దలూ వుండగా మెల్లిగా సంభాషణకి వుపక్రమించి—

'మేమంతా చిన్నవాళ్ళం — బొత్తిగా అనుభవంలేదు—ఏదో చేతనయినట్లు చేశాం ప్రయత్నాలన్నీ— ఆ రెండు రోజులూ మాట దక్కి పెళ్ళివారిని మర్యాదగా సాగ నంపటానికి మీరంతాకూడ మాకు సహాయం చెయ్యాలి.' అన్నాడు మర్యాద వినయం వుట్టిపడేలా.

'మావల్ల ఏమైనా లోపాలు వున్నా మీరుకూడ సర్దుకుపోవాలి...' అతని మాటలు పూర్తికాకుండానే వాళ్ళంతా

ముక్తకంఠంతో 'నయమే వింత మాట— మేం పరాయివాళ్లమల్లే మీ లోపాలు ఎంచటానికి—అసలు కుర్రాళ్లు మీరు ఇంత బాధ్యతగా ఒప్పుగా పనులన్నీ చేయిస్తుంటేనే చూడటానికి ఎంతో ముచ్చటగా వుంది మాకు—మీకేం భయంలేదు అందరం తలో చెయ్యివేస్తాం— లక్షణంగా శుభకార్యం జరిపించి పెళ్లివారిని సంతృప్తిగా సాగనంపుదాం.' అన్నారు — ధోరణి మార్చుకుని పనుల్లో సాయం చెయ్యటము మొదలుపెట్టారు — పెళ్లివారు వచ్చి విడిదిలో దిగారు—ముందు ఎన్ని ఖబుర్లు చెప్పినా ఆ వేళ్టికి ముకుందానికి ఏమిటో గుండెలు దడదడలాడటం మొదలు పెట్టాయి. వాళ్లేం పేచీలు పెడతారో—ఏం గొడవలు జరుగుతాయో—ఫలానావారి ఇంటి పెళ్లిలో తగూలాడుతున్నారు అంటూ జరిగినదానికింకా చిలవలు పలవలూ కల్పించి నలుగురూ చెప్పుకుంటే తన కెంత చిన్నతనంగా వుంటుంది — ఆ పైన—తండ్రిలేడు మరి, వున్న అన్నగార్లు ఏదో మొక్కు తీర్చుకున్నట్లు శుభకార్యం అయిందనిపించేశారు అనే మాట కూడ రాకుండా చూసుకోవాలి అనుకుంటూ విడిదికి కాఫీ ఫలహారాలు పట్టించుకు వెళ్లాడు.—పెళ్లివారు చాలా మందే వచ్చారు బంధువులుకాక పెళ్లికొడుకు స్నేహితులే పది మందిదాకా వున్నారు— వాళ్లని పరిచయంచేస్తూ 'వీళ్లని నా కంటె ఎక్కువగా మర్యాద చెయ్యాలి మీరు—నేను ఇంక ఎప్పుడు పడితే అప్పుడే వస్తాను కాని మా స్నేహితులు మళ్లీ మళ్లీ రావటం అంటూ వుండదుకదా.' అని తన హాస్యానికి తనే నవ్వుకుంటూ బావమరిదితో చెప్పాడు పెళ్లికొడుకు, రైలు దిగుతూనే.

'ఎంతమాట—శుభకార్యానికి వీళ్లంతా మా యింటికి రావటమే మా కెంతో సంతోషంగా వుంది—ఇంక మర్యాదలకి లోటు జరుగుతుందా.' అన్నాడు ముకుందం చిరునవ్వుతో.

ఆ స్నేహితులకి మరో కాలక్షేపం లేదు కనక అస్తమానూ పేకాట వేసుకు కూర్చుంటారట—వాళ్లకి కావలసిన పేకలు సిగరెట్లూ, కాఫీలు అన్నీ సప్లయిచేసే బాధ్యత సుందరం మీద పెట్టాడు

ముకుందం?

సాయంకాలంగా ఫలహారాలు చేసి కాఫీలు తాగి స్నానాలకి వెళ్ళబోయే ముందే చిన్న పేచీ వచ్చింది—ముకుందం వణుక్కుంటూ వెళ్ళి విచారించేసరికి అసలు సంగతి బయట పడింది—మొగపెళ్ళివారికి సప్లయి చేసిన తల నూనెలో సెంటు కలిపేశారట ఆడపెళ్ళివారు. 'ఆ సువాసన మాకు ఇష్టం లేదు—అది కావలసినవాళ్ళు రాసుకుంటారు — మాకు విడిగా అచ్చంగ కొబ్బరినూనె కావాలి:' అన్నారు.

'అలాగే—ఒక్క పది నిముషాలు వ్యవధి ఇవ్వండి బజారుకి పంపించి తెప్పిస్తాను - ఇంట్లో వున్నదంతా ఈ సెంటు కలిపేసిందే,' అన్నాడు ముకుందం వినయంగా.

అప్పటికే కనీసం వందసార్లయినా బజారుకి ఇంటికీ మధ్య తిరిగిన ప్రకాశానికి మళ్ళీ బజారుకి వెళ్ళాలనేసరికి ఎక్కడలేని చిరాకు వచ్చింది. 'అసలీ పేచీ లేవతీసిందెవరో తెలుసా—లావుగా పొట్టిగా గుమ్మడికాయలా లేడూ, ఆ బట్టతలాయన— అంతగా సువాసన భరించలేక పోతే ఈ రెండు రోజులకీ నూనె రాసుకోటం మానేస్తే పోయేదిగా ఆ వెనక ఉన్న పుడెండు వెంట్రుకలకీ' అని విసుక్కుంటూంటే.

'తప్పదు ప్రకాశం — అలా విసుక్కో కూడదు — అసలు తప్పు మనదే— అయినా కాకపోయినా ఈ రెండు రోజులూ వాళ్ళు ఏమడిగినా మనం తెచ్చి ఇవ్వాలి—తరువాత మనతో కలిసిమెలిసి వుండిపోయినా ఈ సమయంలో తమ ఆధిక్యత చూపించుకోవాలనీ మనచేత వాళ్ళకి కావలసినవన్నీ జరిపించుకోవాలనీ వుంటుంది కొంతమందికి—త్వరగా వెళ్ళిరా' అని హెచ్చరించి హడావిడిగా మరో పనిమీద వెళ్ళిపోయాడు ముకుందం.

భోజనాలవేళ — వంట అన్నింటిలో కారాలు ఎక్కువ పోసేశారనీ అన్నం మరీ మెతుకుల్లా వుందనీ గునవటం మొదలు పెట్టారు.

ముకుందం మరేమీ అనలేక 'రేపు మీకు కావలసిన విధంగానే చేయిస్తాను' అని హామీ ఇచ్చారు.

మర్నాడు మధ్యాహ్నం మరోరకం ఫిర్యాదు వచ్చింది; అన్నం మెత్తగా ముద్ద అయిపోయిందని — ఆధరువులు రోగిష్ఠివాళ్ళకి

## ఆశలూ అనుభవాలూ

పథ్యం పెట్టినట్లుగా ఉప్పుపప్పు లేకుండా వున్నాయట— 'సరే రాత్రి మరి కాస్త కారం వేయిస్తాను.' అన్నాడు ముకుందం వినయంగా.

రాత్రి లగ్నం జరిగిపోయింది—వివాహపు తంతు అంతా ముగిశాక పీటలమీద నుంచి లేచి పెద్దలందరికీ పాదాభివందనం చేస్తూ ముకుందం దగ్గిరికికూడ వచ్చారు వధూవరులు—పచ్చటి పసుపు బట్టలతో మెడలో ఒత్తుగా కర్పూరపు దండలతో, వాటిమధ్య పసుపుతాడులో ధగధగ మెరుస్తున్న మాంగల్యాలతో చెల్లెల్ని చూస్తూంటే ముకుందం మనస్సు అనిర్వచనీయమైన ఆనందానుభూతితో నిండిపోయింది.

'నాన్నగారు లేకపోయినా ఎవ్వరికీ ఏలోటూ జరగనివ్వటంలేదు—ఆయనకిచ్చిన మాట అక్షరాలా నిలబెట్టుకుంటున్నాను—చెల్లాయికి లక్షణమైన సంబంధం తీసుకొచ్చి పెళ్ళిచేశాను—తమ్ముడిని పెద్ద చదువులకి పంపించాను' — తలుచుకుంటూంటేనే ఓ విధమైన గర్వం అంతులేని సంతృప్తి కలుగుతున్నాయి అతనికి.

కనుకొలుకులలో నిలిచిన ఆనందాశ్రువులని మునివేళ్ళతో అద్దుకుని చెల్లెలినీ బావగారినీ చెరోచేత్తోనూ లేవదీసి అక్కున జేర్చుకున్నాడు.

ఆ మర్నాడు పెళ్ళికూతుర్ని తీసుకుని వెళ్ళిపోయారు పెళ్ళివారు-వచ్చిన చుట్టాలంతాకూడ వెళ్ళిపోయారు—

రెండురోజుల తరవాత.

'అబ్బ ఇల్లంతా మరీ బావురుమంటోందమ్మా— శకుంతలని చూసి ఎన్నాళ్ళో



అయిపోయినట్లుంది' అన్నాడు ముకుందం ఏమీతోచక కాలుగాలినపిల్లిలా కాస్సేపు ఇల్లంతా తిరిగి తల్లి దగ్గిరికి వచ్చి కూర్చుంటూ.

కొడుకునిచూసి జాలిగా నవ్వింది సుభద్రమ్మ. 'ఈసుందరం. శశివాళ్ళు కూడ లేకపోవటంతో ఇల్లు మరీ బోసిపోయింది—రేపు సాయంత్రానికి మళ్ళీ పెళ్ళికొడుకుతో పాటు తిరిగి వస్తారనుకో అయినా ఎన్నాళ్ళుంటుంది—ఆ మూడు నిద్రలూ అయిపోయాక అతనితో పాటే తీసుకుపోతానంటాడేమో — వియ్యపురాలి మాటలధోరణి అలాగేవుంది—కాదూ కూడదూ అని బతిమాలుకుంటే మరో పది రోజు లుంచుతారేమో—ఎంతయినా అది పరాయి సొత్తే—వాళ్ళు దయదలచి పది రోజులు వుంచితే తప్ప. లేకపోతే రోజుల తరబడీ ఇక్కడ వుండే స్వతంత్రం దానికిగాని వుంచుకునే స్వతంత్రం మనకిగాని లేవు' అంది చెమర్చిన కళ్ళు కొంగుతో వత్తుకుంటూ.

'ఆ కుటుంబంలో అందరికీ అతిశయం, అహంభావం ఓ పాలు ఎక్కువే అనుకుంటాను—మనస్సులు విప్పి మాట్లాడితేనే లోకువయి పోతామన్నట్లు మాటలు బిడాయించుకునే వున్నారు ఆ రెండు రోజులూ.' తన మనస్సుకి తట్టినమాట మెల్లిగా బైట పెట్టాడు ముకుందం.

'ఆ—అదంతా మొగపెళ్ళివారి దర్జాలే— నాలుగు రోజులు గడిచిపోతే వాళ్ళూ మామూలుగానే వుంటారు.—'

'పోనీ బావ అయినా మా అందరితో హాస్యాలు చేస్తూ సరదగా మాట్లాడ నేలేదు—ఎంతసేపూ తన స్నేహితులతో కబుర్లు వేసుకు కూర్చోటంతోనే సరిపోయింది.'

'మీరూ మీరూ హాస్యాలు చేసుకోటానికి ముందు రోజులన్నీ లేవూ—కొత్తవాళ్ళతో కలివిడిగా మాట్లాడాలంటే కాస్త బెరుకుగా వుంటుంది కొంతమందికి— అయినా రేపు వస్తున్నాడుగా— ఇంక ఏ స్నేహితులూ వెంట వుండరు—మీరు ముగ్గురూ ఎన్ని హాస్యాలయినా చెయ్యొచ్చు; ఎన్నికబుర్లయినా చెప్పుకోవచ్చు.' అంది సుభద్రమ్మగారు కూతురూ అల్లుడూ ఇంట్లో సందడిగా తిరగటాన్నీ, హాస్యాలతో నవ్వులతో ఇల్లు కళ కళ లాడటాన్నీ వూహించుకుంటూ.

(ఇంకా ఉంది)

# సబ్బులు, డిటర్జెంట్లు

పరిశుభ్రతకోసం సబ్బు అనేక విధాల ఉపయోగపడుతుందని అందరికీ తెలుసు. సబ్బుకి సూక్ష్మజీవుల్ని చంపేశక్తి ఉందని చాలామంది అనుకుంటారు. కాని అది నిజం కాదు. ఏ సబ్బూ సూక్ష్మజీవుల్ని చంపదు. అయితే సబ్బు రుద్దుకోవడంవల్ల సూక్ష్మజీవుల్ని కడిగేయకలుగుతాం. అంతే. చర్మం పై పొరల్లో ఉండే మురికితోపాటు దాంట్లో ఉండే సూక్ష్మజీవులు కూడా కొంతవరకు పోతాయి. సబ్బుతో తోముకునేప్పుడు బ్రష్ ఉపయోగించడం మంచిది. అందువల్ల సూక్ష్మ జీవుల్ని ఇంకా బాగా పోగొట్టచ్చు. అయినా చర్మం లోపలి పొరల్లో సూక్ష్మజీవులు ఎప్పుడూ మిగిలి ఉంటాయి. వాటిని తీసెయ్యడం సాధ్యంకాదు.

చేతులూ, వేళ్లూ పరిశుభ్రంగా ఉంచుకోడం చాలా అవసరం. ముఖ్యంగా వంట చేసేవాళ్లు. ఎందుకంటే వేళ్లద్వారా అనేక సూక్ష్మజీవులు ఆహారంలో ప్రవేశించి వ్యాధులకి దారితీస్తాయి. చేతులు కడుక్కోడానికి మెడికేటెడ్ (మందు కలిపిన) సబ్బులున్నాయి. ఇవి చాలా ఉపయోగంగానే ఉంటాయి. అయితే వీటితో శుభ్రం చేసుకోడం ఎడ్వర్టయిజ్‌మెంట్లలో చెప్పినంత సులువుకాదు. ఏ సబ్బయినా బాగా పని చెయ్యాలంటే ఒక్కసారి రుద్దుకుని వెంటనే కడిగేసుకుంటే చాలదు. సబ్బు నురుగు ఒంటిమీద ఎంతసేపుంటే అంత మంచిది. మందుకలిపిన సబ్బయినా ఎక్కువ సేపు తోముకుంటేగాని ఉపయోగం ఉండదు.

వేడివేడి సబ్బు నీళ్లతో గిన్నెలూ, కప్పులూ కడగడం మంచిదే. అలా చేయడంవల్ల బాక్టీరియా చాలామటుకు పోతాయి. అవి వృద్ధిపొందడానికి సావకాశం లేకుండా పోతుంది. అంతేగాని బాక్టీరియా చావవు. బాక్టీరియా చావాలంటే గిన్నెల్ని సలసలా మరుగుతున్న నీళ్లలో అరగంటయినా ఉంచాలి. కాని మామూలు వాడకానికి అంత జాగ్రత్త అవసరం లేదు. సబ్బునీళ్లతో కడిగితే చాలు.

ఈ మధ్య కృతకంగా తయారుచేసిన (సింథటిక్) డిటర్జెంట్లు మన దేశంలో కూడా ఎక్కువగా వస్తున్నాయి. వీటిలో ద్రవరూపంలో ఉండేవి కూడా ఉన్నాయి. ఇవి కూడా సబ్బుల్లాగే పనిచేస్తాయి. బట్టలుతుక్కోడానికీ, గిన్నెలు కడుక్కోడానికి, ఇవి సబ్బుకన్నా కూడా బాగా పని చేస్తాయి. ఎందుకంటే వాటిని ఉప్పు నీటితో కూడా వాడచ్చు. ఇవి సబ్బుకన్నా బాగా లోపలికి చొచ్చుకొని పోతాయి. నీళ్లలో డిటర్జెంటు కలపడంవల్ల మనం శుభ్రం చేసేవస్తువు (బట్టలుగాని, గిన్నెలుగాని) అన్నిమూలలా బాగా తడిసి, మురికి పోవడానికి అవకాశం ఎక్కువ అవుతుంది. వీటికి బాక్టీరియా వృద్ధిని అరికట్టే శక్తికూడా ఉంది.

—డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి






భూమి తగాదల విషయంలో కొన్ని ముఖ్యమైన పరిశీలనలు మా క్లయంటు తరఫున చెయ్యవలసివచ్చి నేనా పల్లె టూరు వెళ్ళడం జరిగింది. ఫీజు వసూలు చేసుకునేటప్పుడు మహదానందంగా ఉంటుందిగాని ఎండనేవ యీ ఎగుడుదిగుడు పొలాలమ్మట తిరుగుతే మాత్రం ప్రాణి మహా అలసిపోతుంది. ఎలాగో మొక్కుబడి తీర్చుకున్ని తిరుగు మొహం పట్టేసరికి మధ్యాహ్నం రెండున్నర దాటింది. కిళ్ళీ కొట్టు పక్కని కారు ఆపించి లైంజ్యూసు తాగుతున్నప్పుడు ఆనందరావు అనే అతను ఆ ఊళ్ళో బీడీవోగా ఉన్నట్టు తెలిసింది. నాతో బియ్యే చదువుకున్న ఎస్. ఆనందరావే అయి ఉండాలి. వాడు యీ ప్రాంతాల్లోకే ప్రమోషన్ అయి వచ్చినట్టు విన్నాను. భోగట్టా చేసిన మీదట వాడే నని తెలిసింది. వేళ్ళ దాల్లోనే వాడిల్లు అని తెలిశాక నా మనసు ఉరకలు వేసింది. నేను వెళ్ళేసరికి అదృష్టవశాత్తూ యింట్లోనే ఉన్నాడు.

'ఒరి వెధవా, యిక్కడా నువ్వు ఆఫీసరిస్తున్నది ?' అని నేనూ.

'ఉన్నట్టుండి ఎక్కణ్ణించి కొట్టుకొచ్చేవురా రాస్కెల్ ?' అని వాడూ మర్యాదగా పలకరించుకున్నాం.

నాలుగు గదుల్లో ముచ్చటైన క్వార్టర్సు.

పిడూ, పెళ్ళాం, కొడుకూ, ముసలి తల్లీ, యిదీ సంసారం.

వాళ్ళ కబుర్లూ, యోగక్షేమాలూ, కాఫీ టిఫిన్లూ అయేసరికి నాలుగయింది. లేచి నిలుచున్నాను. డ్రైవర్ని కేకేస్తూ.

'కదిలేవా, కాళ్ళు విరగ్గొడతాను.'

'నేనెలాగా కదిలేస్థితిలో లేను. కారే నన్ను తీసుకెళ్తుంది.'

'అనాగేం? టైర్లు కోసేస్తాను. ఇంజను విరిచేస్తాను. డ్రైవర్ని నరికేస్తాను' నేను నవ్వి అన్నాను.

'రాత్రికి కారు క్లయంట్‌కి రిటర్న్ చెయ్యాలిరా, బాగుండదు.'

'అయితే యింకేం, చిన్న చీటీరాసి డ్రైవరు చేతికిచ్చి పంపెయ్యి' వాడు బలవంతం చేసినకొద్దీ ఎందుకోగాని ఉన్నపాటున లేచిపోవాలని పంతం ఎక్కువయింది నాకు. 'రేపు విచారణకి రావలసిన కేసు తాలూకు ముఖ్యమైన ఫైల్సుకొన్ని రాత్రికి స్టడీచెయ్యాలి' అవి చెప్పి అతి కష్టం మీద తప్పించుకున్నాను. 'పదిమైళ్ళ దూరంలో ఉన్నామని తెలిసిందిగదా, యీసారి తీరుబడిగావచ్చి ఓవారం ఉంటాను' అని వాగ్దానంచేసి వదిలించుకున్నాను.

'ఒరే నీకు తెలిసిన ఈ. ఎన్. టీ స్పెషలిస్టు ఎవడేనా ఉన్నాడూ టౌనులో?' అన్నాడు హఠాత్తుగా.

'ఎక్కడో ఎందుకూ మా వీధి చివర్నే ఉన్నాడు...ఫారెన్ రిటెర్న్‌డు. చాలా మంచివాడు. నాకు బాగాతెలుసు. ఏం ఎందుకూ?'

'మా ఆవిడ రాధలేదూ, దానికి యీ మధ్య ఒకటే తలనొప్పి పట్టుకుందిరా. వచ్చిందంటే ఒకపట్టాన తగ్గదు. ఇక ఆ బాధ చూళ్ళేం...గిలగిల కొట్టుకుపోతుంది. ఇక్కడెవరూ సరిగ్గా చూసేవాళ్ళు లేరు...ఎన్నోరకాల మందులిప్పించాంగాని ఏం తగ్గలేదు'

అలాగా పాపం...అయితే అశ్రద్ధచేస్తావెందుకూ...మా కారు తిరుగు ప్రయాణంలో మేమిద్దరమేగా...మీ ఆవిణ్ణి తీసుకుని వెంటనే బయల్దేరు. మా యింట్లో రెండ్రోజులపాటు ఉన్నట్టూ ఉంటుంది. అన్ని పరీక్షలూ చేయించవచ్చుకూడా... రిక్వెస్టుచేస్తే తిరిగి వచ్చెయ్యడానికికూడా మా క్లయంటు కారు యివ్వకపోడు... అంతగా మొహమాటం అయితే మనం పెట్రోలు పోయించుకోవచ్చు'

'మాకూ ఒకజీపు పన్నయి లేకపోలేదు కాని యీ మధ్య అది రిపెయిరులో ఉంది. లేకపోతే యీ దిక్కుమాలిన బస్సుల్లో మనం తిరగ్గలవా? అందులో యీ ప్రాంతాల్లో బస్ సర్వీస్ మరీ ఘోరంరా... ఎంత ఆరోగ్యవంతులయినా బస్సు ఎక్కిన వాళ్ళు లంతో యింతో జబ్బుపడందే దిగి కొంపలకి చేరుకోలేరు. అసలు మా రాధకి తలనొప్పి ప్రారంభోత్సవం జరిగింది బస్సులోనేగా!'

నేను నవ్వి వాచీ చూసుకుంటూ అన్నాను

'అయితే ఇంకా ఆలస్యం చేస్తావెందుకు, బయల్దేరండి.'

'నేను రానడానికి కుదర్దురా' అన్నాడు వాడు అదోలా మొహంపెట్టి. ఆ రాత్రికే ఆ ఊరికి ఎవరో మినిస్టరు వస్తున్నట్టు ఫోన్ వచ్చిందిట. అసలు అలా కాకపోయినా వాడికి ఊరు వదిలి వెళ్ళడం అంత సుళువుకాదట.

'పోనీ నువ్వు రాధని తీసుకెళ్ళకూడదట్రా, ప్లీజ్.'

'ఎంతమాత్రం అభ్యంతరంలేదు...మా ఆవిణ్ణి చూపించలేదని మా ఆవిడ ఎన్నో సార్లు నన్ను దెప్పిపొడచింది. ఏదోవిధంగా అవకాశం లభించింది. అంతకంటె ఏం కావాలి! కావాలంటే నేనే వచ్చి మళ్ళీ ఆవిణ్ణి దిగబెడతాను!'

ఎంతో యిబ్బంది దాటిపోయినట్టు ప్రశాంతమయింది ఆనందరావుమొహం... నా భుజంమీద ప్రేమగా చెయ్యివేసి అన్నాడు.

'నిన్నడక్కుండానే తెలుసురా ... నువ్వు నాకీ ఉపకారం చెయ్యగలవని...ఏం చెయ్యను! పని...ఊపిరి సలపడంలేదు... ఇంట్లోవాళ్ళు నా బాధ అర్థం చేసుకోరు...ఇంతాచేస్తే స్పెషలిస్టు చూసి ఏమీ లేదనెయ్యవచ్చు...ఓసారి చూపించుకుంటె యింక బెంగ ఉండదు...'

'ఇంతకీ యిప్పుడు తలనొప్పి ఉందా, పాపం?'

'ఇప్పుడు లేదు...నిక్షేపంలా ఉంటుంది ఉత్తప్పుడు...ఎప్పుడొస్తుందో వచ్చినప్పుడు మాత్రం మాచెడ్డ బాధ పడిపోతుంది.'

నిజానికి యీ నెల నున్నది నెత్తికి రాసుకోడం పనులు ముతరాము నాకు యిష్టంలేదు. ఇప్పటికే అలసిపోయిఉన్నాను. చీకటిపడేలోగా ఈ శరీరాన్ని యింటికి

# పాపగారి కాపలా

చేరేస్తే పదిమందికి ఉపకారం చేసినంత ఫలం. అయితేనేం, ఆనందరావుగాడి స్నేహం నేనేం మాట్లాడుతున్నానో నాకే తెలియనంత మత్తు కలుగజేసింది. నేను మొహం కడుక్కోడానికి బాత్‌రూంకి వెళ్లినప్పుడు వాళ్ల మాటలు వినిపించాయి.

'మీరు కూడా నాతో రండి అత్తయ్యా!' అంటోంది రాధ కాబోలు.

'బాగుందే... అసలే ఆవిడ మనకి కొత్త. నువ్వు వెళ్లడమే చిత్రమైన విషయం. నేనుకూడా ఎందుకు? అదిగాక యివాళ రాత్రి యిక్కడ నానా హడావిడీను. ఆనందుకేం కావాలో నువ్వూ లేక, నేనూ లేక'...

'అయితే పోనీ ఓ పని చేస్తాను.'

'ఏమిటది?'

'ఎంత ఆలస్యమైనా రేపు సాయంకాలానికి నేను యిక్కడ కొచ్చేస్తాను. ఈ మాత్రం దానికి బాబిగాణ్ణి ఈ చలిగాలిలో అటూ యిటూ తిప్పడం ఎందుకూ? మీ దగ్గర అలవాటేగా, ఉంచేసుకోండి.'

'అవునే అమ్మా ఆ మాట బాగుంది' అంటూ ఆనందు అక్కడికొచ్చేడు.

'పిడసలే అల్లరి వెధవ... కూడా వెడితే రాధ ఊపిరి తిరగనియ్యేడు. ఆసుపత్రులమ్మట తిరిగి యింకేం చూపించుకోగలదు అది?'

'ఏమో అది ఒక్కర్తీ వెళ్లడం ఎంత మాత్రం యిష్టం లేదు నాకు' ఆ మాట విని తెల్లబోయాను నేను.

'అయితే యీ పసికందుని తల్లికి సాయంగా పంపుతానంటావ్!' ఆనందు మాటలకి రాధ నవ్వింది. ముసిల్ది ఊరుకోలేదు.

'ఒరే... రాత్రి కెవరో మినిష్టరు వస్తున్నాడంటున్నావు... బంట్రోతులుంటే మాత్రం... ఇంట్లో ఒక్కర్తెనీ ఎన్ని చూసుకోవాలో ఏమిటో... ఇవే చూసుకోనా, గుక్కపట్టిన కుర్రాణ్ణే సముదాయించనా? నా వల్ల కాదు బాబూ... నిన్నటికి నిన్న నా పీకకి వీణ్ణి వదిలి మీ యిద్దరూ నాటకానికి ఉడాయించారు. మూడు చెరువుల నీళ్లు తాగించాడు ఆ కాస్సేపటిలో కుర్ర గాడిద... ఇంతకీ నెలల వెధవ... వెంటనే రావడం అవుతుందో అవదో... పెద్దవాళ్లు చెప్పడం, ఎందుకు చెబుతున్నారో అని కుర్రాళ్లు వినడం, ఆ కాలం పోయింది. ప్రతి దానికీ భావభేదాంతరాలు బద్దలు కొట్టడం అలవాటయి పోయింది మన కొంపలో...'

ఆ యింట్లో ఆవిడ విక్టోరియా మహారాణి అని మరికాస్సేపటికే రుజువయింది. పది నెలల పాపాయి నెత్తుకొని రాధ వెనుక సీట్లో వచ్చి కూచుంది. బంట్రోతు వచ్చి ఒక బుట్టెలసంచీ, ఫ్లాస్కూ అవీ ఉన్న బుట్టా తెచ్చి అమ్మగారి పక్కనే పెట్టాడు.

'వస్తాం... ఆనందు ... వస్తానండీ' అంటూ ఫ్రంటు సీట్లో కూచున్నాను.

'రాధా, ఓమారు ఇలా రా...'

రాధ సీటుదిగి అత్తగారి దగ్గరకొచ్చింది. కొంచెందూరం తీసికెళ్లి ఏవో గుసగుసలాడింది. ఎంతకీ వదల్దు!

'ఈ ముసలాళ్లకి మరీ చాదస్తాలు ... ఏం అనుకోకోయ్' అన్నాడు ఆనందు.

'అనుకోడానికేం ఉంది!' అని నేను పైకన్నా లోపలెందుకో మహామంటగా ఉంది. రాధ వచ్చి కూచుంది. కారు కదిలింది.

* * *

నిజంగా తలనొప్పి ఉందో లేదో మా వాణ్ణి లొంగదీసుకోడానికి రాధ యీ ఎత్తు ఎత్తిందో గాని అమ్మాయి ఆరోగ్యంగా అందంగా ఉంది. ఆ విగ్రహాన్ని చూసిన వాళ్లెవరైనా యీమె జీవితంలో ఒకసారైనా జబ్బున పడిందంటే నమ్మరు. ఎంత దిట్టమయినది కాకపోతే ... అసలే దారంతా గతుకులు, పైగా డొక్కుకారు. ఈ కుదుపుల్లో యింతగా ఒళ్లు తెలియకుండా నిద్రపోగలదా! కారు కదలడమేమిటి మాగన్ను పడటమేమిటి, అటు తల్లీ పిల్లడూ సీట్లోకి జారబడి ఒకటే, ఒకటే నిద్ర! పైగా కొంతదూరం వెళ్లాక కారు కదలనని కూచుంది. పోనీ అప్పుడైనా లేవాలా? ఊహూఁ. మన లోకంలో ఉంటేగా?

కారు ఎక్కడమైతే ఎరుగుదును గాని డ్రైవింగ్ గురించి ఏబీసీడీలు తెలియవు నాకు. పది నిమిషాలు డ్రైవరు ట్రై చేసినా కారు కదల్లేదు, నేను పైకి

# పోషగారి కాపలా

రాధ పైటకొంగు కాళ్ళదగ్గిర జారాడుతోంది.

ఎగిరి పడుతున్న ఆమె వక్షస్థలం, ఎర్రని ఆ బుగ్గలు, ఎత్తైన ఆ పెదవులు ఆమె నిద్రపోతూ ఉంటేనేం... ఏవేంటే వాళ్ళన్ను నా మేల్కొలుతోంది ఇంక ఎందుకు ఆలశ్యంచెయ్యాలో నాకు అర్థం కాలేదు

రాధ నా ప్రాణస్నేహితుడి భార్య అని అక్షణాన నాకు జ్ఞాపకం రాకపోలేదు

'అవును నా ప్రాణస్నేహితుడి భార్య నాకు పరాయిది ఎలా అవుతుంది!'

ఆమె ఒకరియిల్లాలు కదా!

'అవును, నేనూ ఒక యిల్లాలిభర్తనే. పెళ్ళికాని వాళ్ళయితే యింకా ఎందుకైనా సందేహించాలిగాని మాకు సంస్కారం అప్పుడు గుర్తిండి,

మేం ఏంచేస్తే మాత్రం ఎవరికి తెలుస్తుంది!'

'రేపాకే... రాత్రి ఎంత నాటకానికి వెడితేమాత్రం అంతన్నిద్రా!

'తే... లెటజ్ ఎంజాయ్' అనాలని పించింది.

చప్పుడుకాకుండా హేండిల్‌తిప్పి వెనక సీటు తలుపుతెరిచాను. ముందు ఒంటిగంట వెధవని ఫ్రంటుసీటులోకి ట్రాన్స్‌ఫరుచేస్తే ఆతరువాత యిదేచ్ఛగా చిన్నదానిపక్కగిమీద చెయ్యి వెయ్యవచ్చునుకదా!

కొట్టుకుంటున్న గుండెలతో వణుకుతున్న చేతులతో కుర్రాణ్ణి ఎత్తుకోబోయాను అంతసేపూ అతి ప్రశాంతంగా నిద్రపోతున్న బాబిగాడు ఏం కొత్త తోచిందో ఏమో కెవ్వని అరచి ఏడుపుకి లంకించుకున్నాడు.

రాధలేచి గబగబా బట్ట సవరించుకుని కంగారుగా నిలబడింది.

'కూచోండి. కూచోండి ... పిల్లాడు ఎందుకోలేచి ఏడిస్తేనూ, ఊరుకోపెడదామని... మీకు నిద్రా భంగం అవుతుందేమో అని...!

ఇంకా ఏవేవో సీళ్ళు నమిలాను.

రాధ కృతజ్ఞతా పూర్వకంగానాకేసి తలవంచుకుని చేతులు జోడించింది. పిల్లాణ్ణి యిచ్చేసి పైకివచ్చేసి సిగరెట్ అంటించాను.

హఠాత్తుగా ముసిరిన ఆనందాకలిన్నో గుర్తుకివచ్చి ఒళ్ళు ఒడికిపోయింది.

లదే దినంపాటికి కారణం. అనవసరంగా పిల్లాణ్ణి అంటుగట్టింది. వాడేగనుయూనికి లేచి ఏడవకపోతే యీపాటికి హాయిగా... అయినా యిప్పుడు మాత్రం ఏముందిి! ఇంతదూరం ఊరు ప్రక్కగా తీసుకెళ్ళి తిరిగి రావడానికి ఎంతసేపది యింకో అరగంట పడుతుంది. అరగంట తరువాతైనాటగదా!

ఈలోగా ఏ లారీయినా బస్సయినా యిటువచ్చి హెడ్‌లైట్సుపడితే! ఏంపోయింది! 'ఎవరో నడుచువాళ్ళు ఏకాంతంకోసం వచ్చిఉంటారు'అని సిగ్గుపడి వాళ్ళే పోతారు!

మెన్నటి ఇంగాకటేకన్న ఎక్కువైంది.

రెండోసారి వెనక సీట్లోకి చూశాను.

నా చేతిలో సిగరెట్టు జారిపోయింది. సిగ్గుతో నా గుండె ఆగిపోయింది.

ఒక తల్లి ఒక పిల్లాడికి పాలిస్తోంది!

ఆ పరిస్థితిలోకూడా యింకా ఆమె కళ్ళు మూతపడేఉన్నాయి.

బట్టలు యిదివరకుకంటె చిందరవందరగా ఉన్నాయి.

శరీరభాగాలు యిదివరకుకంటె బహిర్గతమై ఉన్నాయి. అయితేనేం, నా కళ్ళు బరువుగా వాలిపోయాయి

తప్పుచేసిన భావం నిలువెల్లా నన్ను దహించివేయసాగింది.

'రాధా, చల్లగాలిలో అలా తిరుగుదాం వస్తావా!' అని అడగాలనుకున్న నేనే 'రాధమ్మా, తలుపెప్పిగాని రాలేదుగదా!' అని పలకరిద్దామనిపించింది.

నా ఉద్దేశంనుంచి, ఆశ్చర్యంనుంచి, పశ్చాత్తాపంనుంచి నేను తేరుకోకముందే దూరంగా డ్రైవరూ యింకో అతనూ లాంతరుతో పరిగెత్తుకురావడం కనిపించింది.

మాకు సహాయం చేయమని మీరు కోరారు కాబట్టి— ఇది గ్రాంటు అయిందను కుంటాం.'

'అయినా ఏం ఫర్వాలేదు. ప్రతిరోజూ మేమువచ్చి మీ యిద్దర్నీ చూసిపోతుంటాం. మిమ్మల్ని చూడకుండా — మేమునూత్రం ఉండగలమా ?' అన్నాము యిద్దరమూ —

గభే దంపతులకు మమ్మల్ని వదిలి పెట్టటం కష్టమయింది. కానీ మేము చెప్పిన కారణం చాలా బలమైంది కావటం వల్ల— మమ్మల్నిద్దర్నీ అక్కడ్నే వుండమని బలవంతం చేయటానికి అవకాశం లేక పోయింది.

గభే ఆ పూటల్లా కాలుగాలిన పిల్లిలా తిరగసాగాడు. మాతాజీ కండ్లలో కాంతి తరిగింది. ఆ సాయంత్రం మేము బయలు దేరుతుంటే గభే మా యిద్దరి చేతులూ పట్టుకొని మధ్యలో నిలబడి 'మిమ్మల్ని వదిలి ఎలా వుండగలము?' అన్నాడు.

ఆయన పరిస్థితి చూడగానే — చదువు సాగకపోయినా ఫర్వాలేదు. అక్కడ్నే వుండి పోదామా అని అన్పించింది.

చివరకు అతి కష్టంమీద మమ్మల్ని వదిలారు గభే దంపతులు. ప్రతిరోజూ తప్పక వాళ్లింటికి రావాలని — మరీ మరీ చెప్పారు. మాతాజీ తినుబండారాలన్నీ టిఫిన్‌లో పెట్టి మమ్మల్ని హాస్టల్‌లో తిన మని యిచ్చింది. గభే వీధి చివరివరకూ వచ్చి సాగనంపాడు. ఆయన పూర్తిగా కదిలిపోయాడు. బలహీనమైన ఆయన చేయిని అటూ యిటూ వూపుతూ — కండ్లు తుడుచుకుంటూ—మారిక్షా కను మరుగయ్యేంత వరకూ అలాగే నిలబడి పోయాడు.

కొత్తగదిలో చేరింతరువాత— పరీక్షల భయంవల్లనో—ప్రక్క విద్యార్థుల శ్రమను చూసి కించపడటం వల్లనో—మొత్తానికి మా చదువు బాగానే సాగుతుండేది—ప్రతి రోజూ సాయంత్రం గభే దంపతులను చూడటానికి వెళ్లి వస్తుండేవాళ్లం — మమ్మల్ని చూడగానే ఆయనకండ్లు మిల మిలా మెరుస్తుండేవి. మాతాజీ టీలో ఆప్యాయతనూ రంగరించి యిచ్చేది. గభే— ప్రొఫెసర్‌ని మళ్లీ కల్సుకున్నదినం —

# అద్దెకిచ్చిన హృదయం

మమ్మల్నిగురించి మెచ్చుకున్నసంగతి అన్నీ చెప్తుండేవాడు.

ఆ సైకాలజీ ప్రొఫెసర్ — అనుకోకుండా మాకు అన్నివిధాల సహాయం చేస్తున్నందుకు మనసులోనే కృతజ్ఞత అర్పించుకున్నాం —

ఇలా కొన్ని రోజు లయింతరువాత చదువుగొడవలో మేము పూర్తిగా పడిపోయి గభే యింటికి పదిరోజులయినా వెళ్లలేక పోయాం.

ఒకరోజు సాయంత్రం మా కొత్తగది బాల్కనీలో కూర్చొని—మేము యిద్దరం చదువుకుంటుండగా—మా హాస్టల్ స్నేహితుడు మోహన్ గబగబా మా దగ్గరకు వచ్చి.

'ఒరే! మీ గభే వచ్చాడ్రా!'—అన్నాడు.

ఉలిక్కిపడి లేచి నిల్చున్నాం— 'ఏడీ— ఏడీ ?' అంటూ—

'ఇక్కడకు కాదు హాస్టల్‌కు! సరాసరి వార్డెన్ దగ్గరకువెళ్లి మిమ్మల్ని గురించి చెప్పి మీ గదినెంబరు చెప్పమన్నాడు. ఆయన ఆ పేరుగల వ్యక్తులెవరూ లేరు పొమ్మన్నా ఎంతకూ వినలేదు. మీ కేదో స్కాలర్‌షిప్ వచ్చిందనీ ప్రత్యేకంగా హాస్టలులో మిమ్మల్ని యూనివర్సిటీ ఉంచిందని — ఏమిటేమిటో చెప్తూ — చాలాసేపు ఆయనతో వాదం వేసుకున్నాడు. చివరకు వార్డెను మీ క్లాసుమేటు కృష్ణమూర్తిని పిలిచి అడిగితే — 'మిమ్మల్ని మోసం చేసారు — మీ గదిని వదిలిపెట్టటానికి వాళ్లీ ప్లాన్‌వేసారు దర్జాగా—ఓ మేడమీద గదిలో వుంటున్నారు—చూపిస్తా రాండి'— అని తీసుకొని వస్తున్నాడు. నాకీ సంగతంతా తెల్సుకాబట్టి — ముందుగా మీకు చెబ్దామని సైకిలేసుకొని వచ్చాను' అని మోహన్ ముగించాడు.

మా కిద్దరికీ కాళ్లు ఆడలేదు. గభేకి ఎలా ముఖం చూపించాలో అర్థంగాలేదు. నేరం చేసినవారిలా — కంగారు పడసాగాం. గభేనుంచి తప్పించుకోటానికి — ఆ గదిని వదిలి బయటకి వెళ్దామని సిద్ధపడుతుండగానే—క్రిష్ణమూర్తితో సహా—గభే మా మేడపైకి వచ్చేసాడు.

మే మిద్దరమూ తలలు వంచుకొని నిలబడ్డాం.

మా యిద్దరి మధ్యకూవచ్చి — చేతులు పట్టుకొని— 'మీ రెందుకిలా మీ బాబాజీకి అబద్ధం చెప్పారు' అన్నాడు.

మా కండ్లలో నీళ్లు తిరిగాయి. ఆయనముఖం చూడటానికి మా యిద్దరికీ ధైర్యం చాలలేదు.

'ఎంతమంచి పిల్లలను కున్నాను — ఎంతగా మోసం చేసారు'— ఆయనగొంతు బొంగురుపోయింది.

మాకేం చెప్పాలో అర్థంకాలేదు. నిశ్శబ్ద దేవత ఆ గదిలో భయంకరంగా నాట్యమాడింది.

కాసేపాగిన తరువాత — నెమ్మదిగా ఆయన మా చేతులను వదిలిపెట్టి — బరువుగా మేడమెట్లు దిగాడు.

ఇద్దరం ఆయన వెనకాలే నడిచాము. కానీ ఆయన మళ్లీ మా వైపు తిరిగికూడా చూడలేదు

రెండురోజుల తర్వాత—మాతాజీ సహాయంతో గభేకు అన్ని విషయాలూ వివరంగా చెప్పి — నచ్చచెప్పే ప్రయత్నంలో ఆయన యింటివైపు వెళ్లాం.

ఆయన యింటి ముందు ఇద్దరు ముగ్గురు కొత్తవ్యక్తులు కనపడ్డారు.

ఎవరో బ్యాగుతో — ఇంటిలోపలినుండి వచ్చి రిక్షాఎక్కి మా ముందునుంచే వెళ్లిపోయాడు.

మాకు ఇంట్లోకి వెళ్లటానికి ధైర్యం చాలలేదు—

బయట నిల్చొని తచ్చాడుతుండగా లోపలినుంచి సైకాలజీ ప్రొఫెసర్ బయటకు వచ్చాడు.

ఆత్రంగా ఆయన వద్దకువెళ్లి — 'ఏమయ్యింది?' అని యిద్దరం ఏక కంఠంతో ప్రశ్నించాం.

'గభేకి మళ్లీ ఆ పాపిష్టిజబ్బు తిరగబెట్టింది' — అంటూ చర చరా వెళ్లిపోయాడు.

పాలిపోయిన మొఖాలతో యిద్దరం — ఒకరినొకరు చూసుకున్నాం.

తలలు వంచుకొని తప్పుచేసిన వాళ్లలా ఇద్దరం—వెనక్కు తిరిగాం! ●

**వి. సుధాకర్, తిరుపతి**

మీరు తెరపై కనబడగానే ప్రేక్షకులు నవ్వుతారెందుకండి?

నేను చేసుకున్న పుణ్యం.

**ఎస్. హెచ్. ప్రసాద్‌బాబు, రెంటచింతల**

మీరు వివాహం చేసుకున్నారుగదా? ఎన్ని ప్లస్‌లు ఎన్ని మైనస్‌లు? కుటుంబ నియంత్రణ అమలు జరుపుతారా? మనలో మనమాట!

నిస్సందేహంగా; ప్రస్తుతానికి ఒకే ప్లస్; ఇంకా ఎన్నెన్నో. సృష్టిని ఆపి ఆ పాపాన్ని కూడా కట్టుకోలేము — ఇదే మా తల్లిదండ్రులు అనుకునివుంటే నేను మీకు యీ సమాధానాలు యిచ్చేవాణ్ని కాదేమో. ఇది మాలో మా మాట. అర్థమయిందా!

హాలివుడ్ హాస్యనటుల్లో మీ అభిమాన నటుడెవరు?

లారెల్, హార్డీ, జెర్రీ లూయీస్.

మీ మొదటి చిత్రమేది?

హాస్య చక్రవర్తి శ్రీ రేలంగి వెంకట్రామయ్యగారి చిత్రం; శ్రీ అడ్డాల నారాయణరావు దర్శకత్వంలో వెలువడ్డ "సమాజం" నా తొలిచిత్రం

**సి. రమేశ్ కుమార్, సికింద్రాబాద్**

నాకుకూడా మీలాగే హాస్యం నేర్చుకోవాలనివుంది. దానికి చిట్కా చెప్తారా?

నాలాగే నేర్చుకోవాలంటే మూడుమూపాల పాటు భోజనం మానెయ్యాలి. ప్రసంగజ్ఞానం తెలుసుకోవాలి; అంతేకాదంటే ఎవరయినా నీవు హాస్య నటుడివిరా? అని మొహంమీద వుమ్మేస్తే దాన్ని నీరుగా భావించి తుడుచుకోవాలి. నేను విరమించిన తరువాత రాజబాబు లేకపోతే ఇటు నాకు — అటు నీకు జేజే — చెప్పింది జ్ఞాపకముందా!

మీయొక్క ఫోటో పంపించండి. నా ఆల్బమ్‌లో పెట్టుకుంటాను.



## రాజబాబు

ఆల్బంలో పెట్టుకుంటా నంటే పంపిస్తా; జేబులో పెట్టుకుని తిరిగి ఫొటో పాడుచేస్తా నంటే పంపను. ఎందుకో తెలుసా? ఈ మధ్య మనుష్యులకన్నా ఫొటోలకే ఖరీదెక్కువ.

**జె. విజ్జి, సికింద్రాబాదు.**

రాజబాబు మామయ్యా, నీకు నేను అల్లుణ్ణి అవ్వాలని వుంది. అత్తయ్యకి, మీ ముద్దుల కూతురికి నేను నచ్చాలిగా, నాకు మాత్రం మీ అమ్మాయి నచ్చింది కలలో.

యిరవై సంవత్సరాలు కలలతో కాలక్షేపం చేయ్—ఆ తర్వాత తప్పక ట్రయ్ చేస్తా.

సృష్టి మనల్ని సృష్టించింది, మనం సృష్టిని నిర్మించబోతున్నాం. (చంద్రలోకంలో) తర్వాత?

సృష్టిని చూడగలమే కాని సృష్టిని మనం సృష్టించలేము అల్లుడూ —

వరదలవల్ల, తుఫానులవల్ల కొన్ని పల్లెలు, పట్టణాలు నాశనమైనాయికదా, ప్రజలంతా దుఃఖంతో వున్నారుకదా. మీ హాస్యంద్వారా వారి దుఃఖం పోగొట్టగలరా?

పోగొట్టలేకే వెయ్యినూట పది హార్లు పంపించా.

**కె. వి. కృష్ణాజీరావు, గుంటూరు.**

సినిమాలో ముద్దులు ప్రవేశపెడితే మీ అభిప్రాయం వినాలని వుంది?

నేనూ ముద్దుసుపొందే అదృష్టం వచ్చిందని ఆనందిస్తా.

**ఎస్. హేమగిరిబాబు, బి.ఎ. బి. ఇడి హైద్రాబాదు.**

'బాలవాక్కు బ్రహ్మవాక్కు' అంటారు. ఎందుచేతనండి?

బ్రహ్మదేవునికి మెదడు లేదు. అలాగే చిన్నపిల్లలకు మెదడు వుండదు. మెదడు లేనివాడు ఏం మాట్లాడినా నిజమే. బ్రహ్మదేవుణి మెదడు లేకే మంలాంటి వాళ్లందర్నీ సృష్టించాడు. పాపం!

బ్రహ్మచారి ముదిరినా, బెండకాయ ముదిరినా పనికి రాదంటారు? ఎందుకండీ?

ఈ కలియుగంలో బెండకాయ ముదిరితే పనికిరాదు— బ్రహ్మచారి ముదురుతేనే పనికొస్తాడు—సంసారి ముదిరితే పనికిరాడు.

**మొయినుద్దీన్ అహమద్, థర్డ్ బి. ఎ: ఆదవాని.**

హాస్యం అను పదములో విడివిడిగా అక్షరమునకు అర్థము తెల్పి ఆ మూడు అక్షరముల సంబంధముగూర్చి తెలపండి?

అడిగారు కాబట్టి చెప్పాలి. లేకపోతే మీరు జీవితంలో ఎవ్వరేమో అని భయం. 'హా' అంటే నవ్వుకు ముందొచ్చే ఎక్స్‌ప్రెషన్.

'స్య' అంటే సంస్యంలో తుమ్ముంది హాస్యంలో నవ్వుంది.

'ం' నవ్వురాని వాడికి సున్నా వుంది బాగా నవ్వాలనుకునేవాడికి ప్రీడమ్ వుంది.

### బహుమతి పొందిన ప్రశ్న

**పి. శివశంకర్, ముషీరాబాద్.**

అంత బక్కపలచగావున్న మీకు, ఏ చిత్రములోనైనా, లావుగావున్న నాయికను చేతులతో ఎత్తవలసిన అవసరంవస్తే ఏం చేస్తారు?

ఎత్తికు చేస్తా! అంతే! అంతకంటే ఏమీ చెయ్యను.

**చిత్రసమీక్ష :**

# ఆత్మీయులు



'ఆత్మీయులు'లో వాణిశ్రీ

సారధి స్టూడియోస్‌వారి 'ఆత్మీయులు' చూసింతర్వాత యద్దనపూడి సులోచనారాణి సినిమా కథలే బాగా అల్లగలదనిపిస్తుంది. కాని, స్త్రీల మాక్సుకు కథను మళ్లించే మలుపులను 'పట్టు' గలవి చేయటానికి దీనికి స్క్రీన్‌ప్లే దర్శకత్వాలు వహించిన అనుభవజ్ఞులైన 'డి', 'వి', మధుసూదనరావు ద్వయం ప్రత్యేక కృషి చేసినట్లు స్పష్టంగా అగపడుతుంది. అక్కినేని నాగేశ్వరరావు వాణిశ్రీతో తొలిసారిగా నటించిన యీ చిత్రంలో చాలామంది ప్రేక్షకులకు ఆత్మీయులైన హేమా హేమీలు నటీనటు, సాంకేతిక బృందం పనివాడితనం వున్నది. అందువల్ల 'ప్రజెంటేషన్' మాత్రం నీట్‌గానే వున్నది.

గ్రామాలెలా నాశనమవుతున్నాయో నాటిని వదలి పట్నాలకు గొప్పావేరా మాడా సుఖపడ్డానికి ఎట్లా వస్తున్నారో కాకతాళీయంగా స్పృశించి ముఖ్యంగా ప్రారంభమైన 'ఆత్మీయులు' కథ అటు తర్వాత ఇద్దరి మధ్య కాలాంతరాలలో పెరిగే అపోహ అభిమానాలు, చివరికి రగిలే సంఘర్షణలు చిత్రించుకుంటూ చివరికి 'ఆత్మీయత' అన్నింటిని మించి తృప్తినీ సంబంధాన్ని సాధిస్తుందని ఫలవాక్యం పలుకుతుంది.

పాలేరు వీరయ్య యజమాని జగన్నాధంపై జరిగిన దౌర్జన్యానికి, ఒంటరిగా అడ్డంపెట్టి దెబ్బలు తిని ప్రాణాలు విడుస్తాడు. వ్యాపారిగా అదే మహా జగన్నాధం అన్న రాజారావు పట్నంలో స్థిరపడతాడు. పల్లెలో కష్టాలు కావేషాలు గమనించలేక అన్న సలహాతో తమ్ముడు జగన్నాధం పట్నానికి వెళిపోయి సియ్యాం మిల్లు యజమాని అవుతాడు. వీరయ్య కుటుంబం దిక్కులేనిదవుతుంది. అతనికి ఒక మగపిల్లడూ, ఆడపిల్లా వుంటారు. పాపం! భార్య గర్భవతి కూడా. జగన్నాధం వీరయ్య చెల్లెలు మహంకాళిని ఆ యింటి పెద్ద దిక్కుగా ఎమ్మే 10 వేల రూపాయలు వీరయ్య కుటుంబానికి సహాయంగా యిచ్చి మరీ గ్రామం వదలి పోతాడు. కాని వీరయ్యభార్య మరో ఆడశిశువును కని మరణిస్తుంది. మహంకాళి 10 వేలు దిగమింగి, పసిగుడ్డును 50 రూ.లకు అమ్మివేస్తుంది. తతిమ్మా యిద్దరు పిల్లలు కూడా ఆమె రంపపుకోతకు తట్టుకోలేక పట్నం చేరుకుంటారు. హోటలు శ్రీనివాసయ్య సూర్యాన్ని సీతని ఆదరిస్తాడు. సూర్యం కాఫీ హోటలులో 'క్లీనింగ్' 'సెర్వింగు'లతో పాటు చదువు కూడా కొనసాగించి బి. ఏ. ప్యాసవుతాడు. ఈ లోగా జగన్నాధం కుమారుడు చంద్రం, అన్న రాజారావు కూతురు జయా కూడా ఎదుగుతారు. మహంకాళి కుమారుడు చిట్టిబాబు గుమాస్తా. చిదంబరం కూతురుగా పెరిగిన సరోజా పెద్దవారవుతారు. వీళ్ళందరికి రకరకాలుగా సరిదయా తేర్పడతాయి. అనుకోకుండా జగన్నాధం, సూర్యాన్ని సీతని వీరయ్య బిడ్డలుగా గుర్తించి 'తన ఆత్మీయులుగా' ఆదరించి యింట పెట్టుకుంటాడు. పాలేరు కూతురనే సంకోచం లేకుండా 'సీత'ని, తన కొడుకు చంద్రానికిచ్చి పెళ్ళి చేసుకుంటాడు కూడా. రాజారావు జిల్లాజడ్జి అవుతాడు. సూర్యం పోలీసు అధికారి అవుతాడు. జయ సూర్యాన్ని ప్రేమిస్తుంది. సరోజని చిట్టిబాబు ప్రేమిస్తాడు. సరోజ చంద్రం వ్యామోహంలోను చంద్రుడు సరోజా మోహంలోను పడతారు. ఈ దశలో సూర్యానికి సరోజ కూడా తన చెల్లెలేనని తెలిసి పోతుంది. ఆమెను చేరదీసి చిట్టిబాబు [illegible] చేస్తానంటాడు సూర్యం. యిక్కడ కథ [illegible] మాక్సు స్టేజి వచ్చేసింది. దాన్ని బలమైనది చేయడానికి సరోజపాత్ర తన అన్న సూర్యంచేత ఒక ఒట్టు వేయించుకుంటుంది. 'నేన్ని చెల్లెల్ని అని ఎవరికీ చెప్పవద్దు' అంటుంది. దానివల్ల అనేక అపార్థాలు అనుమానాలు తల ఎత్తడమేగాక ఆమెను హత్య చేశానన్న నేరం కూడా సూర్యం తల మీద వేసుకుంటాడు. కాని మహంకాళి పాత్రను తిరిగి సమయానుకూలంగా రంగంలోకి తెచ్చి సమస్యను పరిష్కరించటం జరుగుతుంది. ఇక్కడనే దర్శకుడు నిర్మాత చాలా జాగ్రత్త తీసుకుని కథను ప్రతిభంపోసే ప్రయత్నం చేశారు.

ఆ కారణంగా చిత్రం సుఖాంతమయేలోగా ప్రేక్షకునిలో 'ఉత్కంఠ' రేగుతుంది.

చిత్రంలో సూర్యం (కథానాయకుని పాత్ర) అనాథ అయినా, అదృష్టవంతుడే. కష్టాలన్నీ అతని పాలిట 'వరాలే' అయినాయి. హోటలు ప్రొప్రయిటరు 'శ్రీనివాసయ్య' మొదలు తాను 'కన్‌ఫ్యూజ్' అయిపోయే 'రాజారావు' దాకా అంతా ఆ పాత్రను 'గ్లోరిఫై' చేయటంలో ఎవరికి యెవరూ తీసిపోరు. కాని కథ అంతా సరోజలాంటి ఉపపాత్రలమీద నడుస్తుంది. సరోజపాత్ర మొదటి నుంచి కాకపోయినా ప్రేమలో పడ్డప్పటి నుంచి 'కష్టాల' పాలౌనే అయిపోతుంది. ఈ పాత్రలో నేటి 'టీనేజర్స్'లోని 'పెట్టి బూర్జువా మెంటాలిటీ' వంటి బలహీనత ఎంతగా వున్నదీ లాంటి కొన్ని 'నిజాలు' తొంగిచూశాయి. ఈ పాత్ర తత్వానే విజయ నిర్మల నటనకు ఎదురు తిరిగి ప్రాణం పోసింది. విజయ నిర్మల కొన్నిచోట్ల తనకు యిష్టం లేనిదీపాత్ర అన్నట్లుగా కనపడ్డది. కాని సీత పాత్రలో చంద్రకళ బాగా రాణించింది. మధుసూదనరావుల కామె కృతజ్ఞత చెప్పుకోవాల్సిందే. జయగా 'వాణిశ్రీ' నాగేశ్వరరావు ప్రక్కన అతనంత 'నీట్'గాను నటించి, వున్న పేరును ఇనుమడింప జేసుకుంది. నాగేశ్వరరావుది 'టైలర్ మేడ్' పాత్ర. అన్నదమ్ములుగా అపూర్వంగా నటించిన గుమ్మడి, నాగభూషణం చిత్రంలోని చాలా క్రెడిట్‌ని, తతిమ్మా వాళ్ళ దగ్గర్నించి దోచుకుంటారు. అన్నగా తమ్మునిగా నటించటంలో యీ మధ్య ఏ చిత్రంలోను ఎవరూ యింత బాగా రాణించలేదు. పినిసెట్టి మాటలు బాగున్నాయి. చెయి తిరిగిన ఒక్కొక్కరోళ్లలో కవులకు బాగా పలికాయి. పద్మనాభం, సూర్యకాంతం, చంద్రమోహన్, రాధాకుమారి, బాలుప్రకాష్, రుక్మిణి, వెంకటేశ్వరరావు మొదలైన వారంతా తతిమ్మా హంగు పాత్రలు ధరించారు. సెల్వరాజు 'కామిరా' యస్. రాజేశ్వరరావు సంగీతం నిర్వహించిన ఆత్మీయులు చిత్రంలో 9 పాటలున్నాయి. కాని, త్రాగుడు పాట క్యాబ్రే డాన్సు నైటుక్లబ్ పాటా లేవు. శ్రీశ్రీ వ్రాసిన కళ్లల్లో పెళ్లిపందిరి అన్నపాట సుశీల, ఘంటసాలలు హాయిగా పాడారు. ఈ రోజుల్లో అనే నారాయణరెడ్డి పాటను రాజేశ్వరరావు యీ రోజుల్లో కుర్రాళ్లకు నచ్చేతీరులోనే తయారు చేశారు. గెస్టులుగా వచ్చినా, ప్రభాకరరెడ్డి, ధూళిపాళ రెండు కీలకమైన పాత్రలలో కనపడ్డారు. సకుటుంబంగా సంకోచం లేకుండా చూడ విలుగల యీ చిత్రానికి పంపిణీదారులు నవయుగవారు.

—వీరాజీ

(18—7—69 ఆంధ్రపత్రిక నుంచి పునర్ముద్రితం.)

# సినిమా

## తండ్రికి తోసివేసి ప్రియుని కలుసుకున్న కె. ఆర్. విజయ

ఎన్. టి. రామారావు, కె. ఆర్. విజయ గాఢంగా ప్రేమించుకున్నారు. తన ప్రేయసిని కలుసుకోవాలనుకున్న రామారావుగారు, కె. ఆర్. విజయకు ఫోనుచేసారు; కానీ ఆమె తండ్రి శ్రీ రేలంగి ఫోనులో సమాధానమిచ్చారు: 'తస్సాదియ్యా యిదా సంగతి' అనుకుని శ్రీ ఎన్.టి.ఆర్. తన గొంతుకనుమార్చి మాట్లాడ సాగారు. 'నేనండీ దాణిని మీ అమ్మాయితో మాట్లాడాలి'? ఎవరమ్మాయి, ఆరాణి అని తన కుమార్తెను శ్రీ రేలంగి ప్రశ్నిస్తారు. ఆమె మరెవ్వరో కాదు-డాడీ- మన భిల్లాయ్ డాక్టర్‌కూతురే' అంటూ ఫోను నందుకుంటుంది. 'కంగ్రాచ్యులేషన్స్' అంటూ ఫోనులో శ్రీ రామారావును ప్రశంసిస్తుంది. 'ఎందుకమ్మా' అని అడుగుతారు శ్రీ రేలంగి 'ఆమెకు యీరోజు పుట్టిన రోజట స్నేహితులంతా వస్తున్నారట నన్నూ రమ్మంటూంది; నేను పిలువబడ దంటున్నాను' అని సమాధానమిస్తుంది. 'అదేమిటమ్మాయ్, నీ స్నేహితురాలి బర్త్ డేకి నువ్వు తప్పకుండా వెళ్ళాల్సిందే' అని తనకూతుర్ని సాగనంపుతారు శ్రీ రేలంగి; తన తండ్రిని బోల్తా కొట్టించినందుకు కె. ఆర్. విజయ పొంగిపోయింది; తన ప్రియుడి సన్నిధికి రివ్వున వెళ్ళిపోయింది; ప్రియుని సాన్నిధ్యంలో ఆమె యీ ప్రపంచాన్నే మరచిపోయింది; శ్రీ రామారావు ఒడిలో వాలిపోయింది. 'కట్' అన్నారు దర్శకుడు శ్రీ బి ఎ సుబ్బారావు ఈ విచిత్రమయిన దృశ్యాన్ని తారకరామా పిక్చర్స్ వారి 'భలేతమ్ముడు'లో చూస్తారు. ఒక తల్లికడుపునపుట్టి, విధిచేత విడదీయబడ్డ యిద్దరి అన్నదమ్ముల విచిత్రగాథయే 'భలేతమ్ముడు', ఈ రెండు పాత్రలను ఒకేనటుడు నటించడం కత్తిమీద సాము వంటిది: ఈ భూమికలను శ్రీ ఎన్. టి. రామారావు పోషించారు. సాంకేతికంగా అన్ని హంగులను రంగరించుకున్న యీ చిత్రంలో శ్రీ మహమ్మద్‌రఫీ నేపథ్యగానం



'ధర్మపత్ని'లో నాగభూషణం, జగ్గయ్య, దేవిక

ప్రత్యేక ఆకర్షణ. శ్రీ పుండరీకాక్షయ్య నిర్మించిన యీ చిత్రాన్ని సెప్టెంబరు మాసంలో విజయాపిక్చర్స్ మీకు చూపించడానికి ప్రయత్నిస్తున్నారు

## అన్నయ్యకి కట్నంయిచ్చే స్తోమత లేదని ఆత్మహత్యకి తలపడ్డ సోదరి

హీరో కృష్ణ తన అనుంగు చెల్లెలు మంజులను అల్లారుముద్దుగా పెంచాడు; ఆమె యుక్తవయస్కురాలయింది; ఒక గొప్పింటి అబ్బాయికి మనసిచ్చింది; ఆ అబ్బాయిని పెండ్లాడాలంటే యాభైవేల రూపాయలు కట్నం యిచ్చుకోవాలి; కాని కృష్ణ చేసేది సామాన్యమయిన వుద్యోగం; తన అన్నయ్య పరిస్థితి మంజులకు తెలుసు; తన ప్రియుడ్ని విడచి తను బ్రతుకలేదు; తన అన్నయ్యకు అంత కట్నం యిచ్చుకునే స్తోమత లేదు; ఈ పరిస్థితుల్లో ఆత్మహత్యే శరణ్యమనుకుంది; ఒకనాటి నడిరేయిన చడీ చప్పుడు చెయ్యకుండా యిల్లు వదలి వూరిబయలుకు వెళ్ళింది; అక్కడ కనిపించిన పాడుబడ్డ బావిలో దూకింది. ఆ సమయానికి శ్రీ ఎస్. వి. రంగారావు అప్పుడే రావడం, దూకినశబ్దం విన్నాడు, ఆయన బావిలో దూకి మంజులను కాపాడి గట్టుచేర్చడం; యింతలో కృష్ణ చెల్లెల్ని వెతుక్కొంటూ అక్కడికి రావడం దర్శకుడు మల్లికార్జునరావు 'కట్' అనడం పది నిమిషాల్లో జరిగిపోయింది! ఇది బాస్కర్ పిక్చర్స్ నిర్మిస్తున్న 'చక్రం' అనబడే తమిళ చిత్రం ఆధారంగా తయారౌతున్న తెలుగుచిత్రంలో దృశ్యం. ఈ చిత్రాన్ని శ్రీ బ్రహ్మయ్య



'రాజసింహ'లో లక్ష్మి, కాంతారావు



ఆంధ్ర వరద బాధితుల సహాయనిధికి శ్రీ ఎన్. టి. ఆర్. ఆర్గనైజేషన్ సేకరించిన 6 లక్షల రూపాయల నిధిని తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధిద్వారా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డికి అందజేస్తున్న దృశ్యం. మైసూరు పరిశ్రమల మంత్రి శ్రీ ఎం. రాజశేఖర మూర్తి, శ్రీ ఎన్. టి. రామారావులను కూడా చిత్రంలో చూడవచ్చును

నిర్మిస్తున్నారు; కెమెరాను శ్రీ స్వామి, సంగీతాన్ని శ్రీ టి. వి. రాజు, మాటలను శ్రీ మహారథి, కథను శ్రీ బి. ఎస్. కృష్ణ నిర్వహిస్తున్నారు; కథానాయిక భూమికను శ్రీమతి విజయనిర్మల, హాస్య జంటగా శ్రీయుతులు రాజబాబు, రమాప్రభ నటించే యీ సమస్యాత్మక సాంఘికచిత్రాన్ని మీకు ప్రదర్శించే భారాన్ని విజయా పిక్చర్స్ తీసుకున్నారు

**మంచితనం + అదృష్టం**

ఏ స్టూడియోకు, ఏరోజు వెళ్ళినా, ఏపూటవెళ్ళినా హీరోకృష్ణను సెట్‌మీద చూడడడం పరిపాటి అయిపోయింది, మరి ఆయన యింతమందికి కాల్‌షీట్లను ఎలా

## సినిమా

సర్దగలుగుతున్నారో, యిన్ని గంటలు ఓపిగ్గా ఎలా రంగు పూసుకుని పనిచెయ్య గలుగుతున్నారో నాకు ఎంత ఆలోచించినా అర్థమవడం లేదు; ఇన్ని చిత్రాలలో ఆయన్ను నిర్మాతలు బుక్‌చేస్తున్నందుకు కారణం కృష్ణయిస్తున్న సహకారం + సహాయమేనని అనుకోవడంలో తప్పులేదను కుంటా; 'హీరో కృష్ణచిత్రాలకు ఓపెనింగ్స్ బాగా వస్తాయి మాకు లాభాలు వస్తున్నాయి' అని నిర్మాతలనడంలో అసత్యం యిసుమంతయినా లేదనడానికి 'జగత్‌కిలాడీలు', 'జరిగినకథ' చిత్ర విజయాలు ప్రత్యక్ష సాక్ష్యాలు 'అదృష్ట వంతుడు కృష్ణ' అంటారు చాలామంది; కాని ఆయన అదృష్టవంతుడు + కష్టించి పనిచేసేనటుడు' అంటాను నేను ఈరోజు నిర్మితమౌతున్న తెలుగుచిత్రాలలో సగానికి పైగా కృష్ణ హీరోగా నటించడానికి కారణం ఆయన మంచితనమే.

* * *

'శత దినోత్సవ చిత్ర దర్శకుడు శ్రీ ఆదుర్తి' అనేడి బిరుదాన్ని ఆంధ్ర ప్రేక్షకులవద్ద సంపాదించిన శ్రీ సుబ్బారావు నేడు భారతీయ చిత్రదర్శక శ్రేష్ఠులలో ఒకరు అనేడి పేరును సంపాదించే అవకాశం చక్రవర్తి చిత్ర నిర్మిస్తున్న 'మరో ప్రపంచం'లో యేర్పడగలదని



'పార్వతీశపథం'లో రాజశ్రీ

హిస్తున్నారు సాంఘిక సంక్షేమానికి వుపయోగపడే చిత్రాలను నిర్మించడానికి పూనుకున్న శ్రీయుతులు అక్కినేని నాగేశ్వరరావు, ఆదుర్తి సుబ్బారావులు అభినందనీయులు

**పసిపాపల్ని వోదార్చే, నవ్వించే పాట**

విజయా గార్డెన్స్‌లో 'తాళిబొట్టు' చిత్రానికిగాను శ్రీ మహదేవన్ రికార్డు చేసిన పాటను విన్నాను; ఈ పాటను శ్రీ ఆత్రేయ వ్రాసారు.

'చిట్టిచిట్టి చేతుల్లో
ఏముందో చెప్పుకోండి
-చిన్న-పాపల్లు పాన్నారి బొబులూ'

# సినిమా డైరీ

- భవానీ ఫిలింస్ చిత్రంలోని రెండవ కథానాయిక పాత్రను కుమారి లక్ష్మి పోషిస్తూంది. ఈ చిత్రానికి శ్రీ కమలాకరకామేశ్వరరావు దర్శకుడు
- ప్రముఖ నటి శ్రీమతి కె. ఆర్. విజయ ఆగస్టు 27 న పతి సమేతంగా ఢిల్లీ వెళ్తున్నారు ఆమె సెప్టెంబరు 16 న స్వదేశానికి తిరిగి వస్తారు
- శ్రీయుతులు కె. గోపాలకృష్ణ, కె. హేమాంబధరరావులు శ్రీ ఎన్. టి. రామారావు వరద బాధితుల సహాయార్థం ప్రోగుచేసిన నిధికి ఒకొక్క అయిదువేల రూపాయలు యిచ్చారు.
- భాస్కర్ పిక్చర్స్‌కుగాను శ్రీయుతులు పిఠాపురం నాగేశ్వరరావు, ఎల్. ఆర్. ఈశ్వరి పాడిన కామెడీ పాటను శ్రీ టి. వి. రాజు విజయాగార్డెన్స్‌లో ఆగస్టు 9 న రికార్డు చేశారు ఈ పాటను రాజబాబు, రమాప్రభలపై చిత్రీకరించబడగలదని దర్శకుడు శ్రీ మల్లికార్జునరావు చెప్పారు
- ఎ. ఎం. ప్రొడక్షన్స్‌వారి "మా మంచి అక్కయ్య" చిత్రాన్ని రాయల్‌ఫిలింస్ విడుదలచేస్తారట శ్రీ వి. రామచంద్రరావు దర్శకత్వం వెరపుతున్న యీ చిత్రాన్ని శ్రీ వి. ఆనందమోహన్ నిర్మిస్తున్నారు. శ్రీమతి విజయ నాయిక

ఈ పాటను శ్రీమతి సుశీల పాడుతూ వుంటే, నాకు తెలియకుండానే నా తల వూగిపోయింది. ఈ పాటను 'తాళిబొట్టు' చిత్రంలో శ్రీమతి విజయనిర్మల ఒల్లోరి చేసే పసిపిల్లలను ఆడిస్తూ, ఓదారుస్తూ వాళ్లను నవ్విస్తుంది. ఆమె పాడుతుంటే, హీరో కృష్ణ దూరంగా నిలబడి గమనిస్తుంటాడు అని దర్శకుడు శ్రీ టి. మాధవరావు చెప్పారు. ఈ చిత్రానికి పూర్ణా పంపిణీదారులు; నిర్మిస్తున్నది శ్రీ సుబ్బరామరాజు, ముఖ్య పాత్రలను ధరిస్తున్నది, శ్రీయుతులు కృష్ణ, విజయనిర్మల, కృష్ణంరాజు, విజయలలిత, రాజబాబు, సూర్యకాంతం మొదలైనవారు;

## సినిమా

ఇప్పటికి తయారయిన చిత్రాల నిడివి పదివేల అడుగులు

**ఊరందర్నీ హడలగొట్టి ఆడపిల్ల చేతిలో అవమానం పొందిన మొనగాడు**

విలన్ సత్యనారాయణ దురుసయినవాడు. ఆ గ్రామానికి మొనగాడు అని ప్రతీతి. ఆయన మాటకు చేతకు ఎదురు లేదు— యిలా చాలా కాలంగా సాగుతూ వుంది, ఈ పరువు సంగతి తెల్సుకుంది వన్నమ్మ కునే విజయలలిత; సమయంకోసం వేచి వుండింది. ఒక రోజు సత్యనారాయణ ఒక

## మీకు తెలుసా?

ప్రముఖదర్శక నిర్మాత శ్రీ శ్రీధర్ ఇటీవల తన చిత్రంయొక్క అవుట్ డోర్ దృశ్యాలను విదేశాలలో చిత్రీకరించారు; ఆయన విదేశాల్లో వున్నప్పుడు వారి మాతృశ్రీ చనిపోయారు అందుకే శ్రీ శ్రీధర్‌కు మద్రాసు విమానాశ్రయంలో పూలదండలు యెవ్వరూ వెయ్యలేదట

ప్రముఖనర్తకి శ్రీమతి రాగిణి మరలా సినిమాల్లో నటించడానికి నిశ్చయించారట. ఆమె ప్రస్తుతం శ్రీ జయశంకర్‌కు నాయికగా ఒక చిత్రంలో నటిస్తున్నదట

మళయాళనటి శ్రీమతి షీలా ప్రస్తుతం ఒక కథను వ్రాస్తున్నారట. ఈ కథను విన్నవాళ్ళు 'యిది మీరు వ్రాసినదేనా' అని అడుగుతున్నారట

హిందీనటి శ్రీమతి శశికళ మల్లెపూలు అంటే ప్రాణమట, పూజకుకూడా మల్లెలను వుపయోగిస్తారట

అమ్మాయి పెండ్లిని చెడగొట్టి [illegible] 'నా మాటంటే హడల్ రోయ్' అని వికటాట్టహాసం చేస్తుండగా విజయలలిత రోషంగా వచ్చింది 'నువ్వు మీసంగల వాడివేనా నీకు మానవత్వం వుందా. ఇలా వాగు పనిచేసి యేం సాధించావ్' అని ఆవేశంగా మొఖాన అనేసింది సత్యనారాయణ అదిరిపోయాడు. మారుమాటాడ లేకపోయాడు; అవమానంతో తలదించుకున్నాడు. 'కట్' అన్నాడు దర్శకుడు శ్రీ కె విశ్వనాథం. ఈ సంఘటన 'ఉక్కుపిడుగు' చిత్రంలో కనిపిస్తుంది. శ్రీ ప్రకాశరావు శ్రీ సుధాకర రెడ్డి నిర్మించిన యీ చిత్రం పూర్ణా ద్వారా విడుదలకానుంది. ఈ చిత్రానికి శ్రీ వీటూరి మాటలు పాటలను వ్రాశారు. శ్రీ కోదండపాణి ఆ పాటలకు ట్యూను చేశారు హీరోగా శ్రీ కాంతారావు, మాంత్రికుడుగా శ్రీ రాజనాల, నాయికగా కుమారి రాజశ్రీ నటించిన ఈ చిత్రా



'అందాల పంజరం'లో జ్యోతిలక్ష్మి

# కేమెల్ సిరా దివ్యముగా ఉంటుంది!
# వీటిలో దేనినైనా ఎంచుకోండి




## కేమెల్ "స్పెషల్" సిరా

అద్దు లేకుండా జారే యీ సిరా సరసమైన ధరలో లభిస్తోంది. ప్రతి రోజు వాడుకకు అది దివ్యముగా ఉంటుంది. అది త్వరగా ఆరిపోతుంది. పెన్ను మధ్యలో రాయడము ఆగిపోదు. మీ పెన్నులో కేమెల్ స్పెషల్ సిరా పోస్తే, రాస్తున్నప్పుడు పెన్నును విదిలించనక్కర లేదు. ఇంత మంచి సిరా అయినా దాని ధర సరసముగా ఉండడమే కేమెల్ "స్పెషల్" సిరా ప్రత్యేకత.




## కేమెల్ "డీ-లక్స్" సిరా

ఇది మా క్రొత్త తయారు. మీది ఖరీదైన పెన్ను అయితే, దానికి బాగుగా తగిన సిరా యిదే. ఈ సిరా అద్దు లేకుండా జారుతుంది. త్వరగా ఆరిపోతుంది మరియు అది రాస్తూనే మీ పెన్నును శుభ్రపరుస్తుంది. అంతే కాదు, "డీలక్స్" మీ పెన్నుకు సంపూర్ణ రక్షణ నిస్తుంది. దానిని వాడితే పెన్ను చిన్న ముక్కలుగా ఊడదు. మీ టేబుల్ మీద కేమెల్ "డీలక్స్" సిరా బుడ్డిని పెట్టుకొనుట మీకు గర్వ కారణముగా ఉంటుంది. అది మీ టేబులుకు ఆకర్షణ నిస్తుంది. అది ఎంత సొగసుగా ఉంటుందో అంత నాణ్యమైనది కూడాను.

vision 696 tel

## అక్కినేని నాగేశ్వరరావు జన్మదినోత్సవ చిత్రం

శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకు 1969 సెప్టెంబరు 20 వ తేదికి 45 సంవత్సరాలు నిండి, 46 వ సంవత్సరం ఆరంభమవౌతుంది; సినిమా రంగానికివచ్చి యిరవైఅయిదు సంవత్సరా లవుతూంది, శ్రీ అక్కినేని స్వయంకృషితో, నటనా వైదుష్యంతో అప్పటినుండి యిప్పటివరకు ఆంధ్ర ప్రేక్షకుల అభిమాన కథానాయకుడిగా విరాజిల్లుతున్నారు వీరి 46 వ జన్మదిన సందర్భంగా విడుదల కానున్న చిత్రకల్పనవారి 'బుద్ధిమంతుడు' చిత్రంలో, శ్రీ నాగేశ్వరరావు నటన అద్భుతంగా వుందని రష్ చూసినవాళ్ళు అభిప్రాయపడుతున్నారు శ్రీ ముళ్ళపూడి వ్రాసిన కథలోని రెండు విభిన్న మనస్తత్వాలుగలిగిన అన్న-తమ్ముడి పాత్రలను శ్రీ అక్కినేని అద్వితీయంగా పోషించారట; పరమ నిష్ఠాగరిష్ఠుడయిన అన్నయ్యకు, నవనాగరికతా లక్షణాలు, భావాలు అలవడ్డ తమ్మయ్యకు జరిగే సంఘర్షణ సారమే యీ 'బుద్ధిమంతుడు'; శ్రీ నాగేశ్వరరావుతో శ్రీమతి విజయనిర్మల ప్రేయసిగా నటించిన మొదటి చిత్రంకూడా యిదే; లక్ష్మీఫిలింస్ ద్వారా విడుదల కానున్న ఈ చిత్రం సంగీత, శృంగార సాత్విక గుణ ప్రధానమయినది.

* * *

ప్రముఖ క్యారెక్టరు నటుడు శ్రీ ఎస్ వి రంగారావు యిటీవల శస్త్రచికిత్స చేయించుకున్నారు ఇప్పుడు స్వస్థత చేకూర్చుకున్నారు ప్రతిదినం రెండు కాల్‌షీట్లు తెలుగు తమిళ చిత్రాలలో నటిస్తున్నారు ప్రతిరోజూ ఉదయం ఎనిమిది గంటల కల్లా మేకప్‌తో సెట్లో వుండడాన్ని చాలాసార్లు గుర్తించాము. తన్ను పెట్టుకున్న నిర్మాతలకు శ్రీ రంగారావు తన సంపూర్ణ సహకారాన్నిస్తూ, సకాలంలో చిత్రం పూర్తయ్యేందుకు తోడ్పడుతున్నారు ఆహారం విషయంలో మాత్రం యింకా కొన్నాళ్ళ పథ్యంగా వుండవలసి వస్తుందని, ప్రస్తుతానికి 'పండ్లరసం, పెరుగన్నం తీసుకుంటున్నా'నని యిటీవల శారదా స్టుడియోలో కలిసినప్పుడు వ్యక్తపరిచారు.

—శ్రీనివాస్



'భలేతమ్ముడు'లో ప్రభాకరరెడ్డి విజయగిరిజ



'అగ్గివీరుడు'లో రాజశ్రీ, ఎన్. టి. రామారావు

ప్రదేశ్ అవతరణము ఎంతమాత్రము ఎవరికి సమ్మతము కాలేదు. ఇది బలవంతపు బ్రాహ్మ వివాహములాగ జరిగినది.

ఎందుకంటె ఇంతకు పూర్వము రాజాకార్ల మూమెంట్‌లో తలదాచుకోవటానికి ఆంధ్రప్రాంతము వచ్చినప్పుడు ఎన్నో రకాలుగ యిబ్బందిపెట్టి విపరీతమైన ఉబ్బాస గడించినారు., అంతేగాకుండా కీ. శే. బి. రామక్రిష్ణా రావుగారి హయాములో నాన్ ముల్కీ ఉద్యమము లేవదీయబడినది. ఇది విస్మరించరాని విషయము.

ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయములో ఎన్నో అనుమానాలు ఏర్పడినవి. ఎందుకంటె పూర్వానుభవమును పురస్కరించుకొని, తెలంగాణాకు న్యాయం చేకూర్చేబదులు, అన్యాయము జరుగునని అందరు అనుకొన్నారు. కాని ఎంత ప్రయత్నించినప్పటికి, పెద్దమనుషులనే వారి ఒప్పందము సృష్టించి, ముఠా రాజకీయాలు ప్రవేశ పెట్టించి తమ స్వలాభము కొరకు తెలంగాణాను ఆహూతి చేసినారు.

కాల గర్భములో పుష్కరము గడచినది. అప్పటి నుండి, అనగా 56 నుండి, ఒక పద్ధతి ప్రకారము తెలంగాణాకు నిజమైన న్యాయము సమకూర్చలేదు. అప్పటి నుండి ఇంతవరకు ప్రతి విషయమును ప్రతికోణము నుండి పరిశీలించిన ఎన్నో గ్రంథాలు వ్రాయవచ్చును. ఉదాహరణము తీసుకొందాము. కీ. శే. అలీ యావర్‌జంగ్, చీఫ్ ఇంజనీరు సర్వేచేసి, తయారు చేయబడ్డ ఎస్టిమేట్





# ఉత్తరాలు

( 4వ పేజీ తరువాయి)

యగు పోచంపాడు ప్రాజెక్టులు, ఒక పద్ధతి ప్రకారముగా, అవరోధము కల్గించుటకు ప్రదేశ్ ఏర్పడిన తర్వాత నియమించిన స్పెషల్ చీఫ్ ఇంజనీర్స్ కృషి ఇంతింత కాదు.

ఈ విషయము ఇప్పుడు ప్రచారములోకి వచ్చి విని వ్రాసినది కాదు. ఆనాడే చీఫ్ ఇంజనీర్స్ ఆఫీసులో పని చేయుచున్న తెలంగాణా ఇంజనీర్స్ చెప్పిన విషయము గోదావరి జలాలు మహారాష్ట్ర నుండి ప్రవహించును గదా! పోచంపాడు ప్రాజెక్టుకు అనుమతించెదరా! అని ప్రారంభించి, కావలెనని తీవ్రమైన ఆటంకములు సృష్టించి నదీ జలాల వివాదానికి గురి చేసినారు. తర్వాత ఉద్యోగాల విషయాలుకాక ముఖ్యమైనవి. తెలంగాణ కౌలుదారి చట్టము, ఈ చట్టము ఆంధ్ర ప్రాంతము విస్తరింపచేసిన ఒకరోజు కూడ ప్రభుత్వము నిలువదు. భూమిపై పన్నులు కూడా చాలా తేడా ఉన్నవి. తెలంగాణాలో భూమి శిస్తు ఎక్వ. ఈ విషయాలన్నియు స్పృశించిన చర్వితచర్వణము కాగలదు. పోతే ముఖ్యమైన విషయము. మేము రక్షకులము మీరు రక్షితులు అనే భావము ఏర్పడినది. ఇది మానసికమైన మార్పు.

మాకు తెల్సినంతవరకు, మీకు తెలువదు. అన్నిటిలో మేమే గొప్పవారలము. పొహ్యా పోకడ భావము ప్రకటించుట సహజమై పోయినది. ఈ మానసికవ్యథ, క్రమంగా జరిగిన అన్యాయములు తెలంగాణావారిని కృంగదీసినవి. ఇప్పుడు తెలుగు సోదరుల మధ్యన తెలుగేతరులు తోడేళ్ళలాగ ప్రవేశించి ఐక్యతను భంగపరచడము అనేది విశాల దృక్పథము కలవారు సహించని విషయము. పరిస్థితులు తీవ్రమైన తర్వాత మేల్కొనే ఇతర ప్రభృతులను విమర్శించడము ఆ రచయితకే చెల్లు? తెలంగాణా ఉద్యమమునకు ధన సహాయము చేసేవారలు తెలుగేతరులును విమర్శించడము సరియైనది గాదు. సానుభూతిపరులు ఎవరైన సహాయము చేయవచ్చును. డబ్బు కంటె మిన్నగు అమూల్యమైన తమ ప్రాణాలను పవిత్రమైన ఉద్దేశ్యానికి బలి అవుతుంటే డబ్బు గురించి మాట్లాడడము దురదృష్టకరము. రెండు వందల మంది చనిపోయిన, పైగా ఒక్క సానుభూతి వాక్యము అయిన వ్రాయక పోవడము ఈ రచయిత తను ఏమందును. ఉద్యమములో ఇరుపక్షాల దుండగులు ప్రవేశించి భరింపరాని కళంకము తెచ్చి పెట్టినారు. కాని ఏ ఉద్యమము ప్రారంభమైన, అప్రతిష్ఠపాలుచేయుటాని దుండగులు ప్రవేశింతురు. ఇది, ఏ వర్గానికికూడకే మకరమైనదికాదు.

ప్రస్తుత పరిపాలన సుడిగుండములో చిక్కుకొన్నది. ఉద్యమము వల్లె, వల్లెలో వేళ్ళు నాటుకపోయినవి. ఎప్పటికైన తెలంగాణా ప్రజల అభిమతము తప్పనిసరిగా నెరవేరగలదని దృఢముగ విశ్వసింప వచ్చును. తెలంగాణా ఉద్యమమును ఎవరు కూడ ఆపలేరు.

శిద్దరామేశ్వర్, (భిక్కనూరు. తా. కామారెడ్డి).

సాధారణంగా మన వార్త మాన పత్రికలలో తెలంగాణాభాషలో అప్పుడప్పుడు వస్తున్న కథల తెలంగాణేతరుల రచనలే. (వేరే దృష్టితో అనడం లేదు) వారిలో అత్యధికులకు ఇచటి పలుకుబడితో సరయిన పరిచయంలేని కారణంగా భాషను అస్తవ్యస్తం చేస్తున్నారు.

సరయిన పరిచయంలేనివారు ఒక ప్రాంతపు పలుకుబడితో రచనలుచేసి, దానిని అసహజరీతిలో ప్రపంచానికి పరిచయం చేసేబదులు దానిమానాన దానిని వదిలివేయడం మంచిది. ఈ ప్రాంతపు భాషను అసహజంగా చిత్రీకరించడం మాని వేదనతో వ్రాసిన మాటలే తప్ప వేరుకాదని మనవి చేస్తున్నాను.

—టంకశాల అశోకన్ (వరంగల్)

# తెలంగాణా ఉద్యమం

(12-వ పేజీ తరువాయి)

అధ్యక్షుడు లక్ష్మణ్ బాపూజీని, మరి 14 మందిని 25 తెల్లవారు ఝామున నేరనిరోధక చట్టముక్రింద పోలీసులు అరెస్టు చేశారు. వీరిని రాజమండ్రి జైలుకు తరలించారు.

ఆదివారం 29—6—69.

నిజామాబాదు జిల్లాలోని బస్‌స్టాండులో దౌర్జన్యానికి దిగిన తెలంగాణా ఆందోళకుల గుంపును చెదరగొట్టడం కోసం పోలీసులు 26 వ తేదీన కాల్పులు జరిపినప్పుడు ఒకవ్యక్తి మరణించాడని అధికార రీత్యా తెలిసింది. గుంపు విసిరిన రాళ్ళదెబ్బలకు ఒక తాసిల్దారు, ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టరు, ఇద్దరు సబ్‌ఇన్‌స్పెక్టర్లు గాయపడ్డారు.

సోమవారం 30—6—69.

సికిందరాబాద్— నిజామాబాదు సెక్షనులో బొలారం వద్ద 29 వ తేదీ ఉదయం ఫిష్‌ప్లేటులు తొలగించారట.

# రంగుటాట్నం

(31వ పేజీ తరువాయి)

గించుకొని, తిరిగి నీరు దొరికినప్పుడు బకెట్లకొద్ది తాగి భర్తీ చేసుకొంటుందని గ్రహించారు. కాని దాని జీర్ణాశయంలోని నీరుమాత్రం మానవుడు తాగుతాడన్నది కట్టుకథే. దానిలో నీరు త్రాగి దాహం తీర్చుకోవడంకన్నా చావడమే మేలనిపిస్తుందట. అంత భరింపరాని వాసన రుచితో ఉంటుందిట!

—జమ్మి కోనేటిరావు

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA

ఇది 3 నెలలప్పుడు గిరీష్ పటము. అతనికి వారం వయస్సప్పటినుండే అమూల్‌స్ప్రే పట్టడం ప్రారంభించేరు. అతని పెరుగుదల అద్భుతంగ ఉంది.

# ఇప్పుడు చూడండి ఎలాగున్నాడో!

"ఉల్లాసమైన అమూల్‌స్ప్రే అబ్బాయి. ప్రతిరోజు క్రొత్త, క్రొత్త విషయాలు నేర్చుకొంటున్నాడు." అంటున్నారు 13-నెలల గిరీష్ తండ్రి, శ్రీ దిలీప్ చౌబల్.

మీ బిడ్డయొక్క పుట్టినప్పటి బరువు ఆరునెలలో రెట్టింపు కావాలి. సంవత్సరం తిరిగేటప్పటికి మూడు రెట్లవ్వాలి. అమూల్‌స్ప్రే సంతులితమైన, సులభంగ జీర్ణమయ్యే దుగ్ధాహారము. శరీరము బాగుగ పెరుగుటకు ముఖ్యమైన ప్రోటీను ఇందులో ఎక్కువగా ఉంది.
అమూల్‌స్ప్రే వాసియైన స్ప్రే-డ్రైయింగ్ పద్ధతిద్వారా తయారుచేయబడుతుంది. ఈ పద్ధతి యిప్పుడు అమెరికాలో అన్ని శిశువాహారాలు తయారుచేయుటలో ఉపయోగిస్తున్నారు. ఈ పద్ధతి ద్వారా పాల-ప్రోటీను ఎక్కువగా నిలిచియుంటుంది.
వేలాదిమంది తల్లులు ఇప్పుడు అమూల్‌స్ప్రే చనుబాలకు బదులుగగాని, అనుబంధ ఆహారంగగాని ఉపయోగిస్తున్నారు—మొదటివారం నుండే. అందుచేతనే పరిచయం చేసిన రెండేళ్ళలోపుగానే, అమూల్‌స్ప్రే దేశంలో ఎక్కువగా అమ్ముడుపోయే శిశువాహారమయింది.




## అమూల్‌స్ప్రే

తల్లిపాలకు అద్భుతమైన మారుపేరు